# ఆంధ్రసచిత్రవారపత్రిక

3-10-69



చంద్రుడిమీద మనిషి

...పై.

27228

# మీ పాపని జలుబుతో బాధపడనిస్తారా?

అక్కరలేదు !

## విక్స్ వేపోరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కుదిబ్బడ పోగొడుతుంది తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపోరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయిచ్చూ, ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపోరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:



బయటి-చర్మం మీద



లోపల-ఊపిరి ద్వారా

1. బయటి-చర్మం మీద: విక్స్ వేపోరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది. హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపోరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపోరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపోరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపోరబ్ వాడండి.




5IAC

## విక్స్ వేపోరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

# ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 3—10—'69
శ్రీ సౌమ్యనామ సం॥ భాద్రపద మా. బ. అ. మి

సంపుటము : 62 సంచిక : 4

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


విషయానుక్రమణిక

ముఖచిత్రం : చంద్రుడిమీద మనిషి
వెనుక అట్టమీద బొమ్మ : మహాత్మాగాంధీ
చిత్రకారుడు : శ్రీ బాపు



# ఉత్తరాలు

### గమనిక

26-9-69 ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని 12వ పేజీలో ప్రచురించిన 'రచయిత్రి పేర్లు' కథ రచయిత్రి శ్రీమతి పరిమళా సోమేశ్వర్ అని పాఠకులు గమనించ కోరుతున్నాము. —సం.

### కథలు

19—9—69 ఆంధ్రపత్రికలోని వసజాక్షి వస్త్రాపహరణం కథ నేటి పరిస్థితులకు తగినట్లు ఉన్నది. శౌరిగారి అక్షయ తూణీరంలోని కార్టూన్ గేయాలు రచయిత(త్రు)లను సునిశిత విమర్శిస్తూ ఉన్నాయి. డాక్టరు కబుర్లు విజ్ఞాన దాయకముగా, ఉపయుక్తముగా ఉన్నాయి.

అచ్యుతుని శ్రీ గణేష్, బజినేపల్లి.

* * *

క్రిందటివారం పత్రిక నాకు చాలా సంతోషాన్ని కలుగజేసింది. మ్యాడ్సీలేఖ, సహజత్వం కూడిన మా వదిన కథ చదివాక సీరియల్ చదివాను.

డి. వి. రమణారావు, (వరంగల్)

* * *

కాశీపిల్ల కథ రాసిన యర్రంశెట్టిశాయి గారు అభినందనీయులు. కథ చాలా బాగుంది. కాని కథలో కొంచెం పొరపాటున్నట్లుగా తోస్తోంది. 'మా పిన్ని పిల్ని......' అని రాసి, (సీతాపతికి పిన్ని గారు) ఆ తరువాత సీతచేత కూడా 'బాబాయికి వీడాకు లిచ్చి........' అని అన్పిస్తారు. ఇందులో ఆవిడ సీతకి కూడా పిన్నిగారయినట్లుగా చూపించారు. ఇది తప్పు అని నాకు తోచింది. పత్రికాముఖతః వారి యొక్క సంశయం వివరిస్తారని తలుస్తాను.

వి. రేవతి, (పూనా—12)

* * *

మీ పత్రికలో వస్తున్న తెలంగాణా గురించిన లేఖలు వల్ల, మీ పత్రిక వాల్యూ పెర్గిందంటాము. యికపోతే. కథలన్నిటిలో నాకు నచ్చినది బరివాడ కాంతారావుగారి వసజాక్షి—వస్త్రాపహరణం అన్న కథను పాఠకులకు సరికొత్త టీములో నడిపారు. చివరి కథ ముగింపు పాఠకులను సస్పెన్సులో పెట్టినారు. యిదిలేకుంటే కథ యింకా బాగుండేది!

పి. చక్రవర్తి, పి. జాహ్నవి, పి. తిరుమలశ్రీ, పి. అవనిజా, (పిఠాపురం)

### సీరియల్

మీ 5—9—69 తేదీ పత్రికలో శిఖా వెంకట రమణగారి సీరియల్ చదివాక ఈ లేఖ వ్రాయా లనిపించింది. మార్గరేట్‌ను అమెరికన్ యువతిగా అభివర్ణించారు రచయిత్రి. పైగా ఆమె పెరిగిన వాతావరణం కూడా ఆంగ్ల సాంప్రదాయానుకూల మైనది. కాబట్టి మార్గరేట్, సాంబశివంతో ఆంగ్లంలో మాట్లాడుతుందని భావించాలి. కాని ఇది తెలుగుపత్రిక కాబట్టి ఆ మాటలను తెలుగులో అనువదించి (అంటే ఆంగ్లంలో మాట్లాడినా తెలుగులోనే వ్రాయాలి కాబట్టి, వ్రాసారని కూడా భావించాలి. కాని ఈ తేదీ పత్రిక చదివాక మార్గరేట్ ఆంగ్లయువతా, ఆంధ్ర యువతా(!!) అనే సందేహం కలుగకపోదు. ఎందుకంటే ఇద్దరి మధ్య ఎడచే సంభాషణను (ఆంగ్లంలోనైనా, మరే భాషలోనైనానరే) తెలుగులో ప్రవేశపెట్టేప్పుడు పూర్తిగా ఆంధ్రీకరించాలేతప్ప, కొన్ని కొన్ని ఆంగ్ల వాక్యాలు (అవికూడా సగం తెలుగు వాక్యం వాడేశక) ప్రవేశపెడ్తే కథా గమనం కుంటువడుతుంది. కాబట్టి మార్గరేట్ (సాంబశివంల) సంభాషణ పరిశీలిస్తే, ఆవిడ సాంబశివంకోసమే తెలుగు నేర్చుకొని (??) కొని కొన్ని వాక్యాలను ఉపయోగించడం లేదియక (పాపం) ఆంగ్ల వాక్యాలు (మచ్చుకి 'మై డియర్ బోయ్, యిట్ ఈజ్ నాట్ ఎడోక్) వాడిందనైనా అనుకోవాలి. (కాని ఇలా అనుకోవడానికి రచయిత్రి ఎక్కడా అస్కారం ఇవ్వలేదు) లేదా సంభాషణా దృష్ట్యా రచయిత్రి ఆ సన్నివేశానికి న్యాయం చేకూర్చలేదని స్థిరపరచుకోవాలి. ఇలాంటి చిన్న చిన్న లోటు పాట్లే రచయిత(త్రి)ల శైలినే దెబ్బ తీస్తా యన డంలో సందేహం లేదు.

పద్మ, అరుణ, కృష్ణ, (తిరుపతి)

### కార్టూన్

19—9—69 వ తేదీ సంచికలో శ్రీ డి. వి. ప్రసాద్‌బాబుగారు, ఇంజనీర్ల నిరుద్యోగ సమస్య మీద వస్తున్న కార్టూనులను విమర్శిస్తూ వ్రాసిన ఉత్తరాన్ని చదివి నాకు ఈ ఉత్తరం వ్రాయ బుద్ధేసింది. ఆ కార్టూనులు నవ్వుకు బదులు వికారం కలిగిస్తున్నవని వ్రాసారు. సాధారణముగా కార్టూనులు 'పబ్లిక్ ఒపీనియన్'ను తెలుపుతూ ఉంటాయి. ఈ రకమయిన కార్టూనులు, మన దేశంలోని ఇంజనీర్ల నిరుద్యోగ సమస్యను తెలుపుతూ ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాయే తప్ప, ఇంజనీర్లను కించపరచుటకు ఎంతమాత్రము కాదు. కించపరుస్తున్నాయని అనుకోవడం కూడా పొరపాటే.

కె. వి. యల్. నారాయణ (భవానిపట్నా)

# ఇది గాంధీ శతజయంతి ఉత్సవ సంవత్సరం

ఢిల్లీలో శ్రీమతిగాంధీ సమావేశాన్ని ఒకదానిని జరిపారు. ఆ సమావేశానికి వివిధ రాజకీయపక్షాల ప్రతినిధులు, కార్మిక సంఘాల, సాంఘిక సంక్షేమ సంస్థల ప్రతినిధులు, గాంధి సిద్ధాంత కోవిదులు విచ్చేశారు. వారంతా కలిసి గాంధిశతజయంతి ఉత్సవాన్ని దేశవ్యాప్తంగా జరపాలని పెద్దఎత్తున ఒప్పందం చేసుకున్నారు.

ప్రతి పెద్ద పట్టణంలో ప్రజలు విరివిగా పాల్గొన్న సమావేశం తప్పనిసరిగా జరగాలని నిర్ణయించారు.

## జాతీయోత్సాహాన్ని తిరిగి పుంజుకునే అవకాశం

ఊరేగింపులు, ముఖ్యమైన బహిరంగ సమావేశం స్వాతంత్ర్య సమరంలో ఉన్నటువంటి జాతీయోత్సాహాన్ని తిరిగి పుంజుకోడానికి అవకాశం కలిగిస్తుంది.

సమావేశాలలో కులమత విభేదాలని రూపుమాపడానికి, అవినీతిని, మోసాన్ని అంతం చేయడానికి ప్రమాణాలు తీసుకోబడతాయి.

## రెండు ప్రత్యేక అంశాలు

శత జయంతి ఉత్సవంలో రెండు ప్రత్యేక అంశాలు ప్రధాని సభ్యుల దృష్టికి తీసుకువచ్చినట్లు అర్థమవుతుంది. అవి ఏమిటంటే ఖాన్‌అబ్దుల్‌గఫార్‌ఖాన్ ఇండియా రావటం, అక్టోబర్ ఒకటో తేదీన న్యూఢిల్లీలో రాజ్‌ఘాట్ దగ్గర గాంధిదర్శన్ ప్రదర్శనకి ఆయన ప్రారంభోత్సవం జరపడం.

జీసస్ క్రైస్ట్ మళ్లీ ఈ ప్రపంచానికి వస్తే, ఊపిరి తనకుతానే శిలువ వేసుకుని ఉండేవాడని తరచు అంటూ ఉంటారు. మహాత్మాగాంధి విషయంలో కూడా అలాగే అనుకోవచ్చు.

## మొత్తం 1.5 కోట్లు పైగా...

మేడమ్ గంధిగారు గాంధిదర్శన్ ప్రదర్శనని గురించి కూడా వివరించారు. ఎంతోకాదు ఒకకోట రూపాయలు మాత్రమే ఈ పథకానికి ఖర్చు అవుతుంది, బుద్ధజయంతి సందర్భంగా ఓపెన్ ఎయిర్ థియేటర్‌కి 25 లక్షల రూపాయలు ఖర్చుపెట్టినట్లే. గాంధిదర్శన్ ప్రదర్శన్‌ని ఏర్పాటు చేయడానికి పక్కా భవనం నిర్మాణంలో ఉంది. బ్రాడ్‌గేజ్, మీటర్‌గేజ్ మార్గాలలో ప్రత్యేక రైలు ఇండియా అంతా ప్రయాణం చేస్తున్నది. మహాత్మాగాంధి అనే ఒక వ్యక్తి ఉండేవాడని, ఆయన ఇండియాలోనే పుట్టాడని భారతీయులకి గుర్తు చేస్తుందిది. సమ్మానాన్ని కలిగించేందుకు చేస్తున్న ఈ తతంగానికి మరో 50 లక్షల రూపాయలుకూడా ఖర్చు అవుతూ ఉంది. రాష్ట్రప్రభుత్వాలు, విదేశాలలో ఉన్న ఇండియా దౌత్య కార్యాలయాలు పెట్టే ఖర్చు వేరే ఉంది.

## విదేశయాత్రలు

గాంధీయ ఉన్నతాధికారి శ్రీ విజాకత్ గాంధిశత జయంతి ఉత్సవాలని నిర్వహించేందుకు యిటీవల ఇంగ్లండు మరికొన్ని యితర దేశాలు సందర్శించారు. మాజీ ఉపప్రధాని శ్రీ మొరార్జీదేశాయి అదే పనిమీద జర్మనీ వెళ్లొచ్చారు. ఇదే ప్రచార నిమిత్తం శ్రీజయప్రకాష్ నారాయణ్ ప్రస్తుతం ఆస్ట్రేలియాలో ఉన్నారు.

మాజీ కాంగ్రెస్ అధ్యక్షుడు, అఖిలభారత ఖాదీ, గ్రామీణ పరిశ్రమల సంస్థ అధ్యక్షులు అయిన శ్రీ ఢేబర్ ఈ ఉత్సవాలకి ప్రధాన అర్చకుడు. డాక్టర్ సుశీలానయ్యర్, మాజీ గుజరాత్ ముఖ్యమంత్రి, లండన్‌లో భారత హైకమీషనర్ అయిన డాక్టర్ జీవరాజ్ మెహతాలు ఆయనకి సహాయకులు. మద్యనిషేధం విషయంలో డాక్టర్ మెహతా, డాక్టర్ నయ్యర్‌లు తమ శక్తినంతా ఉపయోగిస్తున్నారు. వచ్చేనెల నించి తమ రాష్ట్రంలో అమలు చేయడానికి రాజస్థానికి ముఖ్యమంత్రి శ్రీ సుఖాడియాని ఒప్పించడంలో కృతకృత్యులైనారు. సందర్భవశాత్తు రాజస్థాన్ మద్యాన్ని వాడటంలో అంత ఎక్కువేమీకాదు. రాజస్థాన్‌లో నల్లమందు అంటే చాలా యిష్టం. విదేశ యాత్రికులకి అదృష్టవశాత్తు ఈ మద్యనిషేధంవల్ల యిబ్బందిలేదు. మద్య నిషేధాన్ని అమలు జరిపినా రాజస్థాన్‌లో విదేశీయాత్రికుల వ్యాపారం కొనసాగుతూనే ఉంటుంది.

ఇండియా సెక్యులర్ దేశం అయినప్పటికీ మహాత్ముని పట్టుదలంతా హిందూ ముస్లిం ఐకమత్యంపైనే ఉండేది. కాబట్టి ఈ గాంధిశతజయంతి ఉత్సవసంవత్సరంలో ముసల్మానులని అలక్ష్యం చేయగూడదు. ఢిల్లీ ఉర్దూ కవి గాలిబ్‌కి సంబంధించిన ఉత్సవాలలో 25 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. గాంధిగారి సూక్తులని భారతదేశంలో ఏ విధంగా కాలరాయడం జరుగుతుందో అదేవిధంగా కవి గాలిబ్ గారి కీర్తికి పట్టుగొమ్మ అయిన ఢిల్లీ నగరంలో ఆయన భాష విషయంలో కూడా జరుగుతున్నది.

## దుబారా

ముఖ్యమైన సమస్య ఏమంటే 125 సంవత్సరాలు బ్రతకాలని కోరుకున్న మహాత్ముడు ఈనాడు బ్రతికి ఉండి ఉంటే ఆయన ప్రజాధనం యిలా భారీ ఎత్తున వృధా అవుతుంటే సహించి ఊరుకునేవాడా? ఇది భారీ ఎత్తున జరుగుతున్న దుబారా. ఎందువల్లనంటే గాంధి రైలుగాని, ప్రదర్శనగాని భారతప్రజలపై శాశ్వతమైన ముద్రని వేయలేవు. అవి అజ్ఞానాన్ని రూపుమాపలేవు. ఇక దారిద్ర్యం విషయంలో చెప్పేందుకు ఏమీ లేదు. అవి ప్రజలని సత్యసంధులుగా గాని, అహింసావాదులుగా గానీ రూపొందించలేవు.

## అశాంతి, దౌర్జన్యం

సత్యం, అహింస అనే రెండు కాళ్ల ఎత్తైన బల్లమీద నిలబడ్డాడు గాంధిగారు. సత్యసంధత అన్నది స్వతంత్ర భారతదేశంలో చాలా అరుదైనది. పూర్వం సంగతి వదిలేద్దాం, గాంధి శతజయంతి ఉత్సవ సంవత్సరంలోనే ఎంతో అశాంతి, దౌర్జన్యం, కల్లోలాలని భారతదేశం చవిచూసింది. చెబితే దారుణం అనిపించవచ్చుకానీ, బంగారంతో సింగారించబడ్డ ఒక స్త్రీ ఏ విధమైన ఉపద్రవం లేకుండా ఒక గ్రామంనించి ఇంకో గ్రామానికి వెళ్లగలదా. ఈనాడు ఢిల్లీలో వెండి మాలామా చేసిన చెవిరింగులతో ఉన్న చిన్న పిల్ల క్షేమం కూడా సరిగా చెప్పడానికి వీల్లేకుండా ఉంది. మహాత్మాగాంధి స్కూళ్లనించి, కళాశాలలనించి విద్యార్థులని బయటికి వచ్చేయమని కోరారు. అమాయకులైన ప్రజలని ఉపద్రవాలకి గురి చేయడానికి, ప్రజల ఆస్తి అయిన బస్సులని మొదలైనవి తగలబెట్టడానికి వారు బయటికి వచ్చారిట్రేవల. రాళ్లురువ్వటం గాంధీగారి సిద్ధాంతమా? స్కూలు పిల్లలుకూడా వీటిలో పాల్గొంటున్నారు.

## ఆచరణలో ఉన్న గాంధీయం

ఇప్పుడు ఆచరణలో ఉన్న గాంధీయాన్ని ఉద్ధరించడానికి ఇక్కడ బాబూ జగ్జీవన్‌రామ్‌గారిని చెప్పాలి. మాజీ ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీదేశాయి బాహాటంగా చెప్పారు— బాబూజీ గత పది సంవత్సరాలుగా ఆదాయపుపన్నుని తప్పించుకుంటున్నారని. బాబూజీ ఆ మాటని కాదనలేదు కానీ తాము తమ లాయర్‌ని సంప్రదిస్తున్నామని అన్నారు. ప్రధాని, ఆర్థికమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి, బాబూజీగారి అలస్యానికి కారణం ఆయన మతిమరుపేనని బహిరంగంగా చెప్పారు.

ఏదో ఒక విషయాన్ని మరిచిపోతే అది క్షమార్హం కానీ చట్ట విషయంలో కాదన్న సంగతి అందరికీ తెలిసిందే. కేంద్రంలో మంత్రిగా ఉన్నవారు, అదీ సెప్టెంబర్ 2, 1946నించీ అమాత్య శేఖరులుగా

( 8 వ పేజీ చూడండి )



# గాంధీయం

గాంధీజీ సూక్తులకు గేయానుసరణం / డా॥ సి. నారాయణరెడ్డి

బిందువు లొకటిగ చేరిన
సింధువుగా రూపొందును.
వ్యక్తులొక్కటైన స్నేహ
వారాశులు ఉప్పొంగును.

స్వచ్ఛమైన సంకల్పము
చతికిలబడి పోదు.
అచ్చమైన వాక్కు కడకు
అప్రియమ్ము కాదు.

నరుని గుండె నిబ్బరమును
పరీక్షించు గీటురాయి
మంచు కొండ అంచు కాదు!
మానవ సంఘమ్మోయి.

సులభము దేశముల నడుమ
జలరాశుల నీదుట.
అతికష్టము నరులనడుమ
అంతరాలు దాటుట.

అంతరంగ సింహాసన
మందు ఒకే కాలమ్మున
ప్రతిష్ఠించ వీలుపడదు
పరమాత్మను పిశాచమును.

ముఖము తప్పించెదము
ముప్పు చేసినవాడు.
ఊరంత చాటెదము
ఒప్పు చేసినవాడు.

జీవితమ్ము గులాబి
పూవు వంటిది సుమా!
రెంటెమాటున కలవు
కంటకములు.

అందరు గురువులైన
అపుడు శిష్యులు ఎవరు?
అందుకే ఔదాము
అందరము శిష్యులము.

బడబాగ్ను లెన్నెన్ని
విడద నుడికించినా;
సాగరుడు తనలోని
చలువ కోల్పోవునా?

మనుజులకు పశువులకు
మధ్య అంతరమెంత?
ఇది గ్రహించిన అంత
రించు అరని చింత.

# న్యూఢిల్లీ లేఖ

(6వ పేజీ తరువాయి)

పదవీ నిర్వహణని కొనసాగిస్తున్నవారికి ఆదాయపు పన్ను చట్టం అంటే ఏమిటో తప్పకుండా తెలిసే ఉండి ఉండాలి. పన్ను ఎగవేతని గురించి ప్రతి రెండవ రోజూ లోక్‌సభలో ప్రశ్నలు వస్తూనే ఉన్నాయి. అర్థికమంత్రి అయిన మేడమ్ గాంధి శ్రీ జి. డి. బిర్లా విషయంలో ఈ మతిమరుపుని అంగీకరిస్తారా? లేక మేడమ్‌గాంధిని బలపరిచేవారికి, మామూలు ప్రజలకి వేర్వేరు చట్టాలు ఉన్నాయా? మేడమ్‌గాంధిగారు తమ రక్షకుడిని కాపాడడానికి తమ శక్తియుక్తుల్ని ప్రయోగించినా, లోక్‌సభ, ప్రజలు తప్పకుండా ఆయన మీద బహిరంగ విచారణ జరప వలసిందిగ పట్టుబడతారు. లోక్‌పాల్‌కి నివేదించవలసిన మొట్టమొదటి కేసు ఈయనదే కావచ్చు.

## మరుగున పడిపోయినవారికి ప్రచారం

అసలు ప్రశ్న మేడమ్‌గాంధిగానీ లేక బాబూ జగ్‌జీవన్‌రాంగానీ గాంధీయాన్ని ఆచరిస్తున్నారా అన్నది. నిజం చెప్పాలంటే అసలు గాంధియం అన్నదే ఇండియాలో లేదు. మహాత్మాగాంధి పేరుని రాజకీయ పౌలభ్యం కోసం వాడుకోడం జరుగుతున్నది. కాని ఈ ఉత్సవాలవల్ల మరిచిపోయిన కొందరు కాంగ్రెసు వ్యక్తుల పేర్లకి ప్రచారం లభిస్తుంది. శ్రీ ఢేబర్, డా. సుశీలానయ్యర్‌లని కూడా అందులో చేర్చుకోవచ్చు. ప్రమాణాలని స్వీకరించే ఉత్సవం ఎంతో వొత్తిడితో జరుగుతుంది. దానిపై ఎవరికీ నమ్మకం లేదు. ప్రస్తుతం జరుగుతున్న దానికంటే వేరే విధంగా యింకా ఎక్కువ గౌరవాన్ని పొందే అర్హత జాతిపితకి ఉంది.

## మరో ఉదాహరణ :

పాకిస్తాన్‌కి రు. 55 కోట్లు చెల్లించడానికి ఇండియా ఒప్పుకున్నది. సర్దార్‌పటేల్ తదితరులు కొందరు ఆ ఒప్పందాన్ని వెనక్కి తీసుకోవాలన్నారు. గాంధిగారు నిరాహారదీక్షని పూని ఇండియా తన మాటని నిలబెట్టుకునేలా చేయడంలో విజయాన్ని సాధించారు. మేడమ్‌గాంధి శ్రీ సంజీవరెడ్డి గార్ల నామినేషన్ పత్రాలపైన సంతకం చేశారు. తర్వాత, ఒకానొక సాకుతో, అది మనస్ఫూర్తిగా చేసినది కాదని తేలింది. ఆమె తాము చేసిన దానినుంచి బయట పడ్డారు. ఇంకో మాటలో చెప్పాలంటే ఆమె నిర్ణయానికి ఆమే బద్ధులై ఉండలేక పోయారు. ఇదేనా గాంధీయం?

విచారించదగిన విషయం ఏమంటే గాంధిగారి అనుయాయులలో ఎవ్వరూ ఆయన పేరుని దుర్వినియోగం చేస్తున్నవారిని ఉత్సవాలలో పాల్గొనవద్దని చెప్పలేకుండా ఉన్నారు. తాము ప్రేమించి, సేవించిన ప్రజలకోసం డబ్బు ఖర్చు అయినట్లయితే గాంధిగారు ఎంతో సంతోషించి ఉండి ఉండేవారు. ●

# "ఆంధ్రా - తెలంగాణా"

# తెలుగువాళ్ల సంగతి సాంప్రదాయాలొక్కటేనా?

ఈ శీర్షికను చూడగానే చాలామందికి ఆశ్చర్యము కలుగవచ్చును. కాని ప్రశాంత మనస్సుతో ఒకసారి చదివి ఆ తరువాత నిజానిజాలను గురించి సావధానంగా ఆలోచించుకోవాల్సిందని సోదర పాఠకులను సవినయముగా ప్రార్థిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగినప్పటినుండీ తెలంగాణా ప్రాంతానికి జరిగిన అన్యాయాలలో ఆర్థిక రంగంలో కంటే యెన్నో రెట్లు ఆ ప్రాంత ప్రజల సంస్కృతి, సాంప్రదాయాలకు జరుగుతున్నాయ్. ఇందుగురించి యెవరూ పట్టించుకోనక పోవడం తెలంగాణా తెలుగు ప్రజల దురదృష్టం. ఒక తెలంగాణా తెలుగువానిగా, నా ప్రాచీన సంస్కృతి సాంప్రదాయాలకు జరుగుతున్న అపకారాన్ని గురించి నా ఆవేదనను సోదర పాఠకులు అర్థంచేసుకుంటే నేను ధన్యుణ్ణే.

కోస్తా ఆంధ్రులు అక్కకూతురిని పెళ్లి చేసుకుంటారు. కాని తెలంగాణా తెలుగువాళ్ళకది చాలా పాపం. దానితో సరసమాడుతున్నట్లు యెన్నో సినిమాలలో పాటలను చిత్రీకరిస్తున్నారు. అవి విన్నప్పుడు తెలంగాణా తెలుగు వానినునన్ను యెలా వుంటుంది? కోస్తా ఆంధ్రులు కూతురు, అల్లునితో కాళ్ళు మొక్కించుకుంటారు. అంతేకాక కూతురూ, ఆమె భర్తా ఆమె అన్నదమ్ముళ్ళు(అంటే అల్లుని బావమరదులు) కూడా మొక్కాల్సి వుంటుంది. తెలంగాణా తెలుగువాళ్ళకది మహాపాపం. తల్లిదండ్రులూ, అన్నయ్యలూ గూడ ఆడబిడ్డ, ఆమెభర్త కాళ్ళు మొక్కడం యెంతో పవిత్రమైన కార్యంగా భావిస్తారు. తల్లి, తండ్రి మరణించినప్పుడు కూడ కూతురు నమస్కరించవలసినదే కాని కాళ్ళు మొక్కడం పాపమనేది తెలంగాణా తెలుగువాళ్ళ ఆచారమని దానివెనుక యెన్నోవుదాత్త భావాలున్నాయని యెంతమంది కోస్తా ఆంధ్రులకు తెలుసు? అన్ని సినిమాలలోనూ వాళ్ళ సాంప్రదాయాలనే చూపిస్తున్నారు. కాని పైగా అవి తెలుగువాళ్ళ (?) సాంప్రదాయా లంటున్నారు. యే తెలుగువాళ్ళవి? తన సాంప్రదాయమేమిటో గుర్తెరిగిన తెలంగాణా తెలుగువాడి హృదయం అలాంటి దృశ్యాలను చూసినప్పుడు యెలా వేదనకు గురవుతుందో వాళ్ళు గ్రహించగలరా? మేనరిక మంటే సోదరి తన కొడుక్కు సోదరుని కూతురిని మాత్రమే చేసుకోవాలనేది తెలంగాణా తెలుగువాళ్ళ సాంప్రదాయం. అంతేకాక సోదరుడు తన కొడుక్కు సోదరి కూతురిని కూడ చేసుకోవచ్చునని కోస్తా ఆంధ్రుల సాంప్రదాయం. ఇవన్నీ పరస్పర విరుద్ధంగా లేవా?

కోస్తా ఆంధ్రులలో తమ్ముడు అన్నయ్యని ఏరా అని సంబోధించడం తప్పుకాదు. విచిత్రమేమిటంటే దాన్ని కూడ వాళ్ళు తెలుగువాళ్ళ ఆచారంగానే చెప్పుకుంటారు. వ్యాఖ్య అనవసరమనుకుంటాను.

తెలంగాణా తెలుగు ప్రజల సంస్కృతి అంతా ఉత్తర భారతీయుల నుండి సంక్రమించిందేనని దక్షిణాదిన ముఖ్యంగా కోస్తా ఆంధ్రులలో ఒక దురభిప్రాయముంది. కాని అదెంత శుద్ధతప్పో ఈ క్రింది విషయాలు పరిశీలిస్తే అవగతమవుతుంది.

భారతదేశంలోకెల్లా బతుకమ్మ పండుగను ఒక్క తెలంగాణాలోనే చూస్తాం. హోలీనీ, రక్షాబంధన్ (రాఖీపౌర్ణమి)నూ ఉత్తర భారతీయులే యెంతో ప్రాముఖ్యతతో జరుపుకుంటూండవచ్చు. కాని హోలీని కామదహనం లేక కాముని పౌర్ణమి అనీ వైశ్యులు రక్షాబంధన్‌ను జంధ్యాలపౌర్ణమి అని తెలంగాణాలో అనాదినుండీ జరుపుకుంటున్నారు. కాముని పౌర్ణమి సందర్భంగా తెలంగాణాలో [illegible], బాలబాలికలు వుత్సాహంగా గానం చేసే [illegible] యెన్నో యీనాటికీ ప్రచారంలో వున్నాయ్. (వీటిలో కొన్నింటిని మన ఆకాశవాణి కేంద్రాలు గూడా ప్రసారం చేశాయ్) కోస్తా ఆంధ్రులకు ముఖ్యమైన పండుగ సంక్రాంతి. వారు కొత్త అల్లుళ్ళనూ, కూతుళ్ళనూ ఆ పండుగకే తీసుకొస్తారు. అందుకే మన రాష్ట్రంలో ప్రస్తుతం సంక్రాంతికి రెండురోజులు సెలవు. యీ సంక్రాంతి పండుగకే తెలంగాణాలో తెలుగు ప్రజలు, పెద్దా చిన్నా అనే భేదంలేకుండా సుమారు రెండు నెలలపాటు యెంతో వుత్సాహంగా గాలిపటాలనే యెగురవేస్తారు. ఈ పండుగ సందర్భంగా తెలుగువాళ్ళు జరుపుకొనే వేడుకలను గురించి ప్రత్యేక సంచికలలోనూ మన రాష్ట్రం నుండి వెలువడేతెలుగు పత్రికలలో యెన్నో పేజీలను పేజీలుగా ప్రచురిస్తుంటారు. ఆకాశవాణి యెన్నో ప్రత్యేక కార్యక్రమాలను ప్రసారం చేస్తుంది. కాని ఆకాశవాణిలో గాని ఒక్క పత్రికలోగాని ఒక్కసారి గూడ యీ గాలిపటాల సంగతి ప్రస్తావనకు రాలేదు. తెలంగాణా తెలుగువాళ్లకు ముఖ్యమైన పండుగ దీపావళి. వీళ్ళు తమ కొత్తల్లుళ్ళనూ, కూతుళ్ళనూ యీ పండుగకే తీసుకొస్తారు. గ్రామగ్రామాన, పల్లెపల్లెలకూ జాతి, మత భేదం లేకుండా సర్వులూ యెంతో వుత్సాహంగా యీ పర్వదినాన్ని జరుపుకుంటారు. అయినా తమ స్వంత రాష్ట్రంలో తమ యేకైక ముఖ్యపండుగకు రెండు రోజుల సెలవుకు కూడ నోచుకోలేదు తెలంగాణా తెలుగువాళ్ళు.

అయితే భారతీయ సంస్కృతి అంతా ఒకటేకాదా అని కొందరు తర్కం లేవదీయవచ్చు. నిజమే! భిన్నత్వంలో యేకత్వం, ఏకత్వంలో భిన్నత్వం మన ప్రత్యేకత, వివిధమతాలవారికి, వివిధ భాషలవారికీ,



ప్రశ్నావళి' కిచ్చే ప్రశ్నలు పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర పత్రిక వార పత్రిక, మద్రాసు—1.' అని ...కోరుతున్నాము.— సం॥



# ఆంధ్రా - తెలంగాణా ...

భాషలవాళ్ళ విషయంలో నిజం కావచ్చు కాని అదేలాగ్ని భాషల ప్రజలకూ వర్తించాలనుకోవడం అవివేకం. అందుకు ఉదాహరణలు కోకొల్లలు. వాటన్నింటినీ యిక్కడ ప్రస్తావించడం చర్విత చర్వణమే అవుతుంది. ఆ సాకుతో బలవంతులైన ఒక ప్రాంతం వాళ్ళు బలహీనులైన మరొక ప్రాంతంవారిని ఆయా రంగాలలో అణచివేయ ప్రయత్నించడం అనుచితం. అయితే అలాంటి యేకత్వాన్ని సాధించడానికి ఆచరణలో అందరికీ ఆమోదయోగ్యమైన చర్యలు గైకొనబడిననాడు పరవశించని హృదయముండదు.

విద్వాన్ విశ్వంగారన్నట్లు కొన్ని శతాబ్దాల వరకు వేర్వేరు పరిపాలనలయందు వున్న ప్రజలలో, సంస్కృతీ సాంప్రదాయాలలో, జీవన విధానంలో, యేమాత్రమూ విభేదాలు రాలేదని, లేవని కొంతమంది ప్రముఖులు యెలా అనుకుంటున్నారో అర్థం కాకుండా వుంది. ముంజేతి కంకణమున కద్దమెందుకు? అలాంటి ప్రజలను యేకం చేసేందుకు ఒక రాష్ట్రాన్నేర్పరచగానే సరిపోతుందా? మనకు ఒక స్వంత రాష్ట్రమున్నదని మురిసిపోవడం తప్ప మనమంతా ఒకటే అనే భావ సమైక్యతను సాధించేందుకు అధికారికంగా ప్రభుత్వం మైనా చర్యలు తీసుకున్నదా? పోనీ మన తెలుగునాట యెందరో పండితులు, కవులు, రచయితలు, సంస్కృతీవేత్తలు చరిత్రకారులు, కళాకారులు, ఇతర రంగాలకు చెందిన మేధావులున్నారు కదా! వాళ్లేం చేశారు? చేస్తున్నారు? అలాంటి భావసమైక్యతను సాధించిననాడు తెలుగుజాతి అంతా ఒకటేనన్న గాఢాభిప్రాయం ప్రతి తెలుగువాడి హృదయంలో నాటుకొని వుండేదికదా! యీనాడు చెలరేగుతున్న వుద్యమాలకు కలలోనైనా అవకాశముండేదా?

ఇంతవరకు యెవరూ, యెక్కడా యిల్లాంటి సహేతుకమైన వాస్తవ విషయాలను నాకు తెలిసినంతవరకూ, యెత్తి చూపడం జరుగలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఉపాధ్యాయ వర్గం రిపోర్టు జారీ ప్రచురించిన పత్రాలలో గూడ యీ సంగతులున్నట్లు వినలేదు. సోదర పాఠకులు నా యీ లేఖను సహృదయంతో స్వీకరించి తమతమ అమూల్యాభిప్రాయాలను, సలహాలను పత్రికాముఖంగా తెలియజేస్తారని, ఆయా ప్రాంత భేదంలేకుండా తెలుగుజాతి యేనాటికైనా ఏకత్వాన్ని సంతరించుకుంటుందనే ఆశిస్తున్నాను.

తన సంస్కృతీ సాంప్రదాయాలను ప్రాణప్రదంగా గౌరవిస్తూ, తు.చ. తప్పకుండా ఆచరించే, తెలుగుజాతి ఐక్యత పరమావధిగా యెంచే

—ఒక తెలంగాణా తెలుగువాడు.

* జవాబు

తెలుగుజాతి ఐక్యతే పరమావధిగా ఎంచే ఆయన వ్రాసిన యీ జాబు విభిన్నతను రెచ్చగొట్టే రీతిగా వుండడం చాలా విచారకరం. ఆంధ్రప్రదేశ్ అవతరించిన అనంతరం తెలంగాణా ప్రాంతానికి సంస్కృతి సంప్రదాయాల్లో— అర్థికరంగంలో కంటే ఎన్నో రెట్లు అన్యాయాలు జరుగుతున్నాయనడం నిరాధారం. వాటికి ఎవరివల్ల ఎలాటి అపకారాలు జరుగుతున్నాయో ఈ జాబు వివరించడం లేదు.

కోస్తా ఆంధ్రులు అక్కకూతుర్ని పెళ్ళి చేసుకుంటారనీ, తెలంగాణా...లు అది తప్పుగా భావిస్తారనీ జాబులో ఉన్నది కదా! ఇలాటి పెళ్ళిళ్ళు కోస్తా ఆంధ్రుల్లోనేకాదు. ఇతరత్రా కూడా జరగడం ఆచారంలో ఉంది. కూతుళ్ల చేతనూ, అల్లుళ్ల చేతనూ కాళ్లకు మొక్కించుకోవడం మహాపాపమని తెలంగాణా వారి అభిప్రాయమట! పిన్నలు ఎవరైనా సరే— పెద్దవారికి పాదాభివందనం చెయ్యడం భారతదేశంఅంతటా ఉన్నది. అది తప్పనుకోవడం అనాగరక లక్షణం! అది పాపమని చెప్పడంలో ఉండే ఉదాత్తభావాలేమిటో తెలిపితే బాగుండేది. మేనమామకూతుర్ని పెళ్లిచేసుకోవడం కోస్తా ఆంధ్ర ప్రాంతంలోనూ అనాదిగా వుంటున్నది. మేనత్త కూతుర్ని పెళ్లిచేసుకునే పద్ధతిలేదు. ఉందనుకోవడం పెద్ద పొరపాటు.

బతుకమ్మపండుగ తెలంగాణాలోనే జరగడం దాని ప్రత్యేకతకు చిహ్నమైతే— ఇట్టివి కోస్తా ప్రాంతంలోనూ కొన్ని పండుగలు కొన్ని చోట్లయే జరగడం—ఆయా ప్రదేశాల ప్రత్యేకతకు గుర్తులై ఒక ప్రాంతంలోనే ఎన్నో చిన్న ప్రాంతాలు తయారు కావలసివస్తుంది. జంధ్యాల పౌర్ణమి తెలంగాణా వారిదీ, వైశ్యులదీ అనుకోవడం తప్పు. అది శ్రావణ పౌర్ణమి! దక్షిణ ప్రాంతం అంతటా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులందరికీ సాధారణమైనది! కోస్తా వారికి ముఖ్యమైన సంక్రాంతి తెలంగాణా వారికి ముఖ్యంకాదనీ, ఆ కాలంలో గాలిపటాలను ఎగురవేసే పండుగే ముఖ్యమనీ అనుకోవడం ప్రత్యేకతకు సూచకంకాదు. గాలిపటాలను అప్పుడు ఎగురవెయ్యడం సర్వే సర్వత్రా ఉన్నది. ఆ గాలిపటాలను గురించి ప్రత్యేక సంచికలను పత్రికలు వెయ్యలేదనడంలో అర్థంలేదు.

తెలంగాణా వారికి ముఖ్యమైనదే దీపావళికోస్తా ప్రాంతాల వారికీ, రాయలసీమవారికీ— తక్కిన దాక్షిణాత్యులకూ మహా ముఖ్యమైనది! దానికి కొత్త అల్లుళ్లనూ, కూతుళ్లనూ పిలిచే ఆచారం తెలుగునాటవున్నది. లేదని అనుకోవడం పెద్ద పొరపాటు.

కోస్తా ఆంధ్రుల సంస్కృతీ, సంప్రదాయాలుగా ప్రచారమవుతున్న వాటిలో తెలంగాణాకు సంబంధించిన వేవిలేవు. నిజాన్ని కప్పిపుచ్చి ఆత్మద్రోహం చేసుకోవడమెందుకు? అని అనడం అనాలోచితమైన మాట! ఎవరు దేన్ని కప్పిపుచ్చి, ఎవరికి ద్రోహం చేసేరు? ఏదో మనస్సులో దురుద్దేశం పెట్టుకుని వ్రాసే వ్రాతలు తెలుగుజాతి ఐక్యతను కోరేవారు వ్రాయతగినవికావు. అనైక్యతను రెచ్చగొట్టే వ్రాతలవల్ల ప్రయోజనం శూన్యం.

[పాఠకుని ఉత్తరాన్ని ఒక పండితులకి పంపగా వారు రాసి ఇచ్చిన వ్యాఖ్యతో వేస్తున్నాము. సం.]




పగిలిన అద్దాన్ని ఎవరూ అతికించరు. అతడి జీవితాన్ని సరిగ్గా పోల్చుకోవలసి వస్తే బ్రోకెన్ గ్లాసుతోనే— అదృష్టవంతుణ్ణి చెరిపేవాడూ లేడు దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవాడు లేడు—విద్యార్థి జీవితం తెలియనికాలంలో ఉత్సాహకరంగా తిరిపోయింది. ఆ రోజుల్లో ఎట్లా ఉండేవాడో—ఆ దినాలు గుర్తుకు రావడంలేదు కూడా—అతడు ఉద్యోగంలో ప్రవేశించిన వేళా విశేషం ఎటువంటిదో ఈరోజుకు కూడా స్థిరంగా లేదు—ఎప్పుడూ దినదిన గండం నూరేళ్ళాయుష్షు ఉద్యోగం గూర్ఖాయితే ఏటికి ఎదురీదుతునే ఉన్నాడు—ఆవలిఒడ్డు చేరడం అగమ్య గోచరంగా ఉంది. కనుచూపు మేరలో ఆనడంలేదు—పెద్దలయిన మిత్రుల ఆదరాభిమానాలకు పాత్రుడు కావడంవల్ల నిరుద్యోగి కాకుండా ఉండగలిగాడు—అర్హత ఉండికూడా లేనివాడు అనిపించుకోవాడను—తనంతటతాను రిజయిన్ చెయ్యాలిగాని అధికారులచేత బయటకు నెట్టబడగూడదు—అదే ధ్యేయంతో ఉద్యోగ స్థిరత్వంకోసం ఎన్ని పాట్లు పడ్డాడో—యూనివర్సిటీ చుట్టూ ప్రభుత్వంచుట్టూ లెక్కలేనన్నిసార్లు తిరిగాడు—ప్రభుత్వం యూనివర్సిటీ చేయాలని, యూనివర్సిటీ ప్రభుత్వం చేయాలని ధ్యాపకులను ఎన్ని ఇబ్బందులు పెడుతున్నారోనన్నీ అనుభవించాడు. ప్రపంచ గూర్చి మానవుల్ని గూర్చి తెలుసుకున్నాడు—శారీరకంగా మానసికంగా బలహీనుడయ్యాడు—అయినా అతడిలక్ష్యం నెరవేరాల. ఆ ప్రయత్నంమీదనే మిత్రుడు మదనమోహన్‌రావుగార్ని తీసుకు బయలుదేరాడు. మోహన్‌రావుగారు ఆంగ్లోపన్యాసకులు—ఆయనదగ్గర అతడికి చనువెక్కువ—ఎందుకంటే అతడు పియుసి ఇంగ్లీషు పరీక్షకు వెళ్ళినప్పుడు ఆయనే పాఠాలు చెప్పారు—కాని పరీక్ష యింగ్లీషులోనే పోయిందనుకోండి— తరువాత సంవత్సరం ఆయనదగ్గరకు వెళ్ళకుండానే పాసయ్యాడు. ఆయనకు అతడంటే సానుభూతి—ఎందుకంటే అతడికి అన్యాయంగా అన్యాయం జరిగిపోతుందికదా అని—అతడికి సాహాయ్యం చేయడానికి అతడు ఎప్పుడు ఎక్కడకు రమ్మన్నా తక్షణం బయలుదేరి వస్తాడు—వాళ్ళిద్దరూ కలిసి మరల యూనివర్సిటీకి బయలుదేరారు. అక్కడ వాళ్ళలాంటి సామాన్యులకు పని కావడం చాలా కష్టం—పని చేయించుకునే ప్రయత్నాలు సులువులు మెళకువలు వాళ్ళకు తెలియలేదు—భగీరథ ప్రయత్నం చేయగా కొంత భోగట్టా సేకరించకలిగారు ప్రస్తుతం పనికాక పోయినా ఎప్పుడో ఒకప్పుడు అవుతుందని నిర్ణయించుకొని ఆవలిగేటుకు రాగలిగారు ఎట్టకేలకు—

సాయంకాలం యూనివర్సిటీ నుండి సిటీబస్సులో టౌనుకు వెళ్దాం అనుకోవడం శుద్ధ తెలివితక్కువ. ఇద్దరికీ ఓపిక లేదు—అయినా దారిలో రిక్షా ఎక్కడయినా దొరకవా అనే నమ్మకంతో మాట్లాడుతూ నడుచుకుంటూ వచ్చారు—రిక్షా దొరికింది. ఎక్కడ—ఎల్లమ్మతోట దగ్గర—ఇంతదూరం ఎట్లావచ్చారో—ఆశ్చర్య పోవడానికి ఓపికలేదు—ఆ కష్టాలు ఆ రిక్షా వల్లకీలో పడేసి బస్సుస్టాండు స్మశానానికి పోనిమ్మన్నారు. విశాఖపట్నం బస్సుస్టాండు వంటి వల్లకాడే నయం అన్న దృష్టితో—తీరా వెళ్ళేసరికి ఆఖరి బస్సు కూడా జారిపోయింది. ఇక మాడంతి వాళ్ళవస్థ—విజయనగరం పోవాలంటే రాత్రి 12 గం॥ నైట్ ఎక్స్‌ప్రెస్‌బస్సు తప్ప మరోగతిలేదు—అంతవరకూ కాలం గడపాలి, ఎలా? అతడికి ఉన్న దురలవాట్లలో పుస్తకాలు కొనడం ఒకటి—అతడికి కావలసినవి, అతడు నచ్చినవి పుస్తకాలు బజార్లో కనపడితే అవాడు భోజనం మానేసయినా పుస్తకం కొంటాడు. విశాఖపట్టణం ఎప్పుడు వెళ్ళినా ముందుగా పుస్తకాలుకోసం పేవ్‌మెంట్లు వెతుకుతాడు. ఎందుకంటే అక్కడ వైస్‌చాన్సలర్స్‌కి ఇచ్చిన కాంప్లిమెంటరీ పుస్తకాలు, యూనివర్సిటీ రీడర్సు, లెక్చరర్సు అమ్మేసిన పుస్తకాలు కాంప్లిమెంటరీ కాపీలు చవుగ్గా దొరుకుతాయి. తదుపరి గుప్తా బ్రదర్సు, బుక్ సెంటర్ చూడకుండా రావడం అరుదు కొంత కాలక్షేపం కూడా కావాలికదు! షాపింగుకు బయలుదేరారు. దిగంబరకవుల రెండు, మూడుభాగాలు, తిరుపతి వేంకటకవుల పుస్తకాలు కొన్ని తీసుకున్నాడు—

ఆయన కొన్ని ఇంగ్లీ పుస్తకాలు కొనుక్కున్నారు. ఎన్నాగయితేనేం 8—30 గం॥ వరకూ ప్రొద్దుపుచ్చారు.

ఇక భోజనంచేయాలి. ఆట్లా కొంత కాలం గడపవచ్చు — విశాఖలో భోజనం చేసినా అర్థాకలే. హోటళ్ళన్నింటిలో పవరంగ్ హోటలు కాస్తంత మెరుగు— ఏదో ఉప్పు, కారం రుచి చూడవచ్చు— తిన్నగా అక్కడకు పోయి సింపుల్‌గా యిద్దరూ ఓ పదిరూపాయిల బిల్లు చెల్లించారు. తినడానికి సిద్ధపడ్డప్పుడు పైసా ఒకు వెనుకాడకూడదు అని వాళ్ళ ఉద్దేశ్యం కాబోలు. రాత్రి 10 గం.వరకూ అక్కడే తచ్చాడారు. తిన్నగా సరస్వతి జంక్షను వరకూ వచ్చి ఏ లారీ అయినా దొరక్కపోతుందా అని ఓ గంట వరకూ ప్రయత్నించారు — ఎక్కడా లారీ టికెడి లేదు — రిక్షా చేయించుకొని బస్సు స్టాండుకు బయలుదేరారు.

ఆ రాత్రి 11 గం. కాలంలో ఆ బస్సు స్టాండులో వాతావరణం వర్ణనాతీతం—అడుగుతీసి అడుగు వేయడానికి వీలు లేకుండా పండుకున్నారు అంతా ఒక్క [illegible]లంలోని సభ్యుల్లాగ—కుంటి గ్రుడ్డి అనాథలు, కుష్ఠు వగైరా అనారోగ్యులు. వీరితోపాటు బస్సు తప్పిపోయిన ప్రయాణీకులు. రంగాలవారు— నిద్రపోయినవారు — నిద్రరాక కునికిపాట్లు పడుతున్నవారు. కథలు చెప్పుకొనేవారు కాలక్షేపం చేసే వారు—ఎన్నో రకాలు......

'మోహన్‌రావుగారూ ? వీళ్ళనుబట్టి చూస్తుంటే భారతదేశం సామాజికవ్యవస్థ ఎంత పురోగమిస్తుందో అనిపిస్తుందండి' ...అతడు—

'ఏం— అలా అంటున్నావు' ఆయన.

'వేరువేరు ప్రదేశాల మనుష్యులు ఎంత ఐకమత్యంగా ఉన్నారో కదా అని' అతడు.

'ఐకమత్యంగా ఉంటే దేశం సాంఘికంగా అభివృద్ధి చెందుతుందంటే మంచిదే —కాని ప్రస్తుతం వాళ్ళు అట్లా ఉన్నారా అని'...ఆయన.

'ఏం...ఎందుకుండగూడదు' అతడు.

'ఉండకూడదని కాదు—వీళ్ళనుబట్టి నీవు దేశాన్ని గూర్చి మాట్లాడ్డం తెలివి తక్కువ' ఆయన.

'ఏందుకని' అతడూ

## అతడి కథ...

'వీళ్ళు ఈ రాత్రి తలదాచుకోవడానికి మాత్రమే ఉన్నారు. కావాలంటే అడిగిచూడు — మా ఖర్మకొద్దీ ఉన్నాం అంటారు. తెల్లారితే ఎవరిదారి వారిదే.' ఆయన.

'సరేలెండి ... మనకెందుకు' వాదన. కాస్తంత నడుం వాల్చడానికి చోటు వెతుక్కుందాం పదండి' ఒక్క కిళ్లీ బడ్డీ అయినా ఖాళీలేదు. టీ దుకాణాలు కూడా నిండిపోయాయి నిద్దరతో — మొత్తం బస్సుస్టాండు వెతగ్గా వెతగ్గా అదృష్టవశాత్తు ఒకచోట ఖాళీ బడ్డీ ఒకటి కన్పడ్డది. అక్కడ వాసనబట్టి అది పువ్వులు అమ్మే దుకాణంలాగ కన్పడుతుంది దానిపై ఒక గోనె ముక్క కూడా వేసి ఉంది. ఎవరో రిజర్వు చేసుకున్నారు కాబోలు ఆ స్థలం సరే ఎవరో వచ్చేవరకూ విశ్రమించ వచ్చుకదా! పెద్దవారని కాబోలు మోహనరావుగారిని దాని పైకి ఎక్కించాడు, అతడిదగ్గర దిగంబర కవులను ఆయనకు తలగడగా యిచ్చాడు. ఇక తను. ఆ ప్రక్క చిన్న బల్ల ఉంటె లాక్కువచ్చాడు. ముక్కాలి పీటమీద నిల్చోవడానికి గంగిరెద్దు ఎంత తాపత్రయ పడుతుందో అలాగే అతడి ఆరడుగుల కళేబరాన్ని ఆ మూడడుగుల, వాల్గుకాళ్ళ బెంచీపై పడవేసాడు. అదృష్టవంతులు కొందరకు నిద్ర పిలవంగానే యిట్టే వస్తుంది. కాని అతడు అదృష్టవంతుడు కాదని ముందుగనే తెలిసిందికదా! మేష్టరుగారు ఎప్పుడు నిద్రపోయారో చిన్నగురకతోసహా నిద్దిస్తున్నారు. పూర్వజన్మలో ఆయనకు చిన్న సంగీత వాసన ఉండిఉంటుంది. ఎప్పుడో నాన్నమ్మ తాతయ్యనుగూర్చి అన్న వాక్యం యిప్పుడతనికి గుర్తు వచ్చింది. తనకు యింటిదగ్గర నిద్ర పోవడానికి రెండు మూడు గంటలు యిటూ అటూ తిరిగి లేనేకాని నిద్రరాదు. అందులో ఇప్పుడు ఈ స్థలంలో నిద్ర వస్తుందా — గత స్మృతులను తలంచుకుంటూ వర్తమానంతో ఏం చేయాలో అర్థంగాక భవిష్యత్తు ఉత్సాహంగా ఉండాలని ఆశిస్తూ ఏవో పిచ్చిపిచ్చి ఆలోచనలు చేస్తున్నాడు — ప్రక్కనుండి వేడినీళ్ల వాసన వస్తోంది. ఎవరో ఒక ఆమె పగలంత బస్సులమీద సామాన్లు వేసిన తన పెనిమిటికి ఉడుకునీళ్లు పోస్తూ తన చేతులతో గాజుల చప్పుడుతో అతని శరీరం రుద్దుతోంది. అంతమాత్రానికే తన కష్టాన్నంతా మరచిపోతాడు ఆ అల్ప సంతోషి— అనుకుంటూ ఆకాశంవేపు దృష్టి సారించాడు. నిర్మలంగా వుంది. సప్తమహాఋషులు, పిల్లలకోడి గొల్లవాడూ కావిడి అన్నీ సరిగ్గానే ఉన్నాయి ఆకాశంలో—చల్లని పిల్ల వాయువు చిన్నగా వీస్తోంది—'ఒరే నాకు అలవాటు లేదు గందా...కసింత తీసుకుంటాము...యింటి కాడ మా నూకాలు ఆసలే అనుమానం మడిసి...'

'మరేం బయ్యం నేదునేరా...యిప్పుడే యింటికాడి కెళ్ళాకేటి...రెండు చుక్కలు తాగినావంటే ఇక చూడు నాయాల రిక్షా దానంతటదే పోద్ది... మరి నాలుగు పైసాలు ఎక్కువ వాగొచ్చు—ఏ తెల్లార గట్ల యింటికెళ్లి తొంగుంటే నీ నాయిరాలు నూసిందా పెట్టించా నెమ్మా...'

'...ఏవోరా...నాకు బయమేస్తుంది... గుండెల్లో మంట పుట్టుకొస్తుంది ... పెద్దోళ్లబేరం తగిలితే నాగవేం మాన్నేం రా...'

'మరేం నేదునేరా'''పెద్ద పెద్దోల్లందరూ తాగిందనాలా జే మన రిక్షాల్లోనే గదరా ఆరింటికాడికి ఈడ్చి పడేత్తాం... మరి నీ శర్లానికేంబాద నేదునే... మరి కంత వాగించు...'

'...అరికేం...పెద్ద పెద్దవన్నీ తాగుతారు...శర్లాలు పెడిపోవు...'

'పెద్దవి తాగినా ... సిన్నవి ... తాగినా కొసకి అన్నీ ఒకటేరా సన్నాసి.'

'ఏందిరా...మరి గంటే...నీవు మరి మొగమూటెట్టేస్తుండావు' ... అక్కడేదో కాపురాల గుడిసె కాబోలు. చిన్నసంభాషణ వినిపిస్తోంది. పగలంతా రిక్షాలు తిరిగే లాగ కష్టపడి ఆ కష్టాన్ని మరిచిపోవడానికి సామాన్యులు చేసేపని. ఇందులో తప్పు లేదేమో!—ఇంతలో ఓ నడివయస్సు వాడు వచ్చి 'ఓలు యిక్కడ తొంగున్నారు నా బడ్డీ కాడ'...అతడి ఆలోచనలన్నీ ఒక్కసారి ఎగిరిపోయాయి. 'మేమేనయ్యా బస్సు




ఒక్క వారంలో నా ముఖం ఎంతో స్వచ్ఛంగా, మృదువుగా అందంగా అయింది!

# పాండ్స్ 7-రోజుల చారుచర్య

## అమోఘంగా మార్చింది నా ఛాయను

వాడిపోయి కాంతిహీనంగావుండే నా ముఖాన్ని చూసుకొని నాకే విసువుపుట్టింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభంలేదనిపించింది-సునీల్ నాకిచ్చే విందుకు 8 రోజులే గడువు. నిరాశచేసుకున్నాను! ఇంతలో పాండ్స్ 7 రోజుల చారుచర్య ఎంత అమోఘంగా పనిచేసిందో అనిసునిత చెపుతూవచ్చేవిషయం అకస్మాత్తుగా జ్ఞాపకంవచ్చింది— ఒకసారి వాడిచూద్దామని నిశ్చయించుకున్నాను.

**చారుచర్య-దాని ప్రత్యేకత**

ఒక్క వారంరోజులపాటు, ప్రతీరోజూ రాత్రిపూట నా ముఖానికి పాండ్స్ కోల్డ్‌క్రీమ్ రెండేసిసార్లు పట్టించాను, మొదటిసారి ముఖంమీద చేరిన దుమ్ము మేక్-అప్‌ను తొలగించడానికి పట్టించాను.



నా ముఖానికి రెండవసారి క్రీము పట్టించాను—ఇదే సౌందర్యానికి కిటుకు! క్రీము చర్మములోకి లోతుగా ప్రవేశించి సబ్బు నీరు శుభ్రపరచలేని మరుగుపడివున్న మురికిని తొలిగిస్తుంది. నా ముఖంలాగే నీదీ అతి సుకుమారంగా మృదువుగా జీవకళ ఉట్టిపడుతూవుంటుంది!

నిజంగా ఆనాటి ప్రత్యేకవిందు దిగ్విజయమే నా ముఖం అంతకళగా అందంగా ఎప్పుడూ చూడలేదని సునీల్ అంది! నాటినుంచి ప్రతీరోజూ రాత్రిపూట పాండ్స్ కోల్డ్‌క్రీమ్ రెండుసార్లు రాసుకోటం అభ్యాసం చేసుకున్నాను. ఈ రాత్రే మొదలుపెట్టండి పాండ్స్ 7-రోజుల చారుచర్య మీ ముఖం కూడా మృదువుగా అందంగా అవుతుంది!






## పాండ్స్ కోల్డ్‌క్రీమ్ -ప్రపంచంలో బాగా అమ్ముడుపోతూన్న చర్మాన్ని శుభ్రపరచే క్రీమ్

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమిత బాధ్యతలతో యు.ఎస్.ఎలో స్థాపితము)

P-4956



# నేను మీకు గుర్తున్నానా?

మధురాంతకం రాజారాం

మానవులందరూ ఒక్కటే అన్నది నినాదం. కానీ పురుషుల్లోనైనా పుణ్య పురుషులు వేరుగా వుండడం లేదా? సరిగ్గా అలాగే తెలుగు వాక్యాల్లో 'నేను మీకు గుర్తున్నానా?' అన్నది చాలా అదృష్టం చేసుకున్నదని నా భావం. ఈ వైపున వినయంగా అడిగేవాడున్నూ, ఆ వైపున ధీమాగా బదులివ్వవలసిన వాడున్నూ — ఇద్దరు అంగరక్షకులు కదండీ దీనికి!

ఇద్దరు వ్యక్తులున్నారు. ఇద్దరిలోనూ ఒకడు గొప్పవాడై వుంటాడు. మరొకడు సామాన్యుడు. ఆ యిద్దరికీ ఎంతో కొంత పూర్వ పరిచయం వుండి వుంటుంది. చాలాకాలం తర్వాత వారొకరి కొకరు తారసిల్లడం జరిగింది. ఎంత గాలి వీచినా చెట్టు వంగి తుంగ దగ్గరికొస్తుందా? సామాన్యుణ్ణి పలకరించే ఆసక్తి గొప్పవాడికి లేకపోవచ్చు. కానీ సామాన్యులకి, గొప్పవాణ్ణి పలకరించి అతడి చేత 'అబ్బో. నువ్వు గుర్తులేకేం' అనిపించుకుని ఆ విధంగా తన హోదా కాస్త పెంచుకోవాలన్న ఉబలాటం ఉండడం సహజం. చాపల్యం జీవలక్షణమనీ, అందుకు మానవుడు క్షంతవ్యుడనీ అనుకుందాం!

కానీ విధివైపరీత్యం ఒకటుంది గదా! అది కాస్త వికటించి—ఆ గొప్పవాడు పెదవి విరిచి 'అబ్బే, ఒకరా, యిద్దరా! కొన్ని వేల మందిని చూస్తుంటాం. ఎక్కడ గుర్తుంటుంది? నిన్ను చూచిన జ్ఞాపకమే లేదు' అన్నాడంటే సామాన్యుడి ముఖాన మిరియాల కషాయం చల్లినట్లే వుంటుంది. ఆరడుగుల వ్యక్తిత్వం అంగుష్ఠమాత్రంగా దిగజారి పోవడానికి క్షణంలో సగం సేపు పట్టదు!

పాపం, మా రామానుజానికెదురైన దురవస్థ యిదే!

అలాగని రామానుజాన్ని సామాన్యుడనుకోడం శుద్ధ పొరబాటు.

రామానుజానికి పదెకరాల మాగాణి వుంది, అంతకు రెండింతల మెట్ట పొలం వుంది; మా వూరి చింతలేటి గట్టున వున్న పెద్ద కొబ్బరితోట రామానుజానిదే! ఒక్క చింత మహసూలు పైన్నే అతనికేడాదికి ఐదువేల నికరాదాయముంది. ఈ వివరాలన్నీ నాకు తెలుసు. వసంతవిహార్ ప్రొప్రయిటరుకేం తెలుసు?

అంగట్లో అన్నీవున్నా అల్లుడి నోట్లో శని అంటారుగదండీ! రామానుజంలో ఒక దుర్గుణం వుంది. వేషంలో అతడు నిరాడంబరుడు. ఈ కఠోరనియమం ఏ గాంధీమహాత్ముడిలాంటివాడికో చెల్లుతుందిగానీ మనలాంటి వాళ్ళకు సాధ్యం కాదంటే రామానుజం వప్పుకోడు. మామూలు తెల్లటి బట్టతో ఒక పైజమా, పొట్టిచేతుల చొక్కా, దువ్వక పోయినా దువ్వినట్టే వుండే క్రాపింగు. యిదీ అతడి వేషం. లోపలి శరీరానికి వెల లేదని భావించి, మనిషినలాగే వేలం పాటలో పెడితే రామానుజం పాతిక రూపాయలు పలకడు. వసంతవిహార్ ప్రొప్రయిటరు సంగతలా కాదు. వేళ్ళకు రవ్వల ఉంగరాలు. ముంజేతికి చిన్న గంగాళం లాంటి చేతి గడియారం. మెడలో బంగారపు గొలుసు. పెద్ద సిల్కు జుబ్బా. కళ్ళకు సులోచనాలు. ఎంత లేదన్నా వేలం పాటలో అతడైదారువేల రూపాయలు పలికేటట్టున్నాడు!

రామానుజానికి ఉంగరాలు, గడియారాలు, సిల్కుజుబ్బాలు మొదలైన పరంజామా బొత్తిగా లేదనుకుంటే, మనం

అతడిపట్ల కేవలం అపచారం చేసినవాళ్లం మాత్రమే కాగలము! జమ్మిచెట్టులో నిక్షిప్తం చేయబడిన పాండవుల ఆయుధ సంపత్తిలా అవి అతడి స్వగృహంలో పదిలంగా వుంటాయి. మునుపటి కొక శ్రీమంతుడు స్వగ్రామంలో బికారి వాడిలా తిరుగుతూ 'ఈ వూళ్లో నన్ను గురించి తెలియని వాళ్లెవరు? ఇక్కడ నేనెలా వున్నా పరవాలేదులెమ్మనేవాడట! ఆ పెద్ద మనిషి అదే వేషంలో మరొకచోట కనిపించగా 'ఇదేమిటి స్వామీ! ఈ వూళ్లోనైనా తమరు కాస్త కంటికి నదరైన బట్టలు తొడుక్కోగూడదా?' అంటూ ఆ పరిచితుడెవరో విస్మయం వెలిబుచ్చాడట! అందుకా శ్రీమంతుడు 'అబ్బే, ఈ వూళ్లో నన్నెరిగిన వాళ్లెవరున్నారయ్యా! ఇక్కడ నేను గోచిపాత కట్టుకుని తిరిగినా అడిగే వాళ్లెవరు పొమ్మన్నాడట! అసలు సిసలు ఔదార్యానికి అంతకు మించిన తార్కాణా అక్కర్లేదుగానీ రామానుజం సంగతి వేరు వ్యాపార నిమిత్తం దూర ప్రాంతం వెళ్తున్నవాళ్లు వాటిపైన విలువైన దుస్తులుంచుకోడం ప్రమాదకర మని రామానుజం నమ్మకం. ఇప్పుడైతే యిబ్బంది లేదు. హోటల్లో గది దొరక లేదనుకో ఏ పార్కు బెంచీ దొరికినా చాలు. నిశ్చయంగా నిద్రపోవచ్చు.

ఆ పట్టణంలో దిగగానే మాకు తెలియవచ్చింది వసంతవిహార్ ప్రశస్తి. ఆగ్రా పౌరులకు తాజ్‌మహలు అంతటితో గర్వకారణమై వుండదు. పాలగచ్చు నేల. పంకాలు సరసరా చేసే చల్లటిగాలి. మరతిప్పగనే వేడినీళ్లు. బటన్ నొక్కగానే వెయిటర్లు. అవి కుర్చీలా! అది భోజనమా! — అందుకని డబ్బు తీసుకుంటున్న ఉద్యోగి ఆ కొండ క్రింద తెనుగురాజులు కట్టించిన భవనం వుంది. వెళ్లి చూడండి' అంటె మనం వెళ్లాము. కానీ డబ్బు తీసుకోకుండా ఒక హోటలును గురించి అలా ఉచితప్రచారం చేసి పెడుతున్న పురజనుల ఔదార్యాన్ని ఎలా కించపరచగలము? 'మనం ఆ హోటల్లోనే బస చేయాలి' అన్నాడు రామానుజం.

'డబ్బేకావలసింది! అభ్యంతరంవుండదు' అన్నాను,

హోటలు ఆవరణలో ప్రవేశించాము. ముందుగా కొన్ని క్రోటన్‌మొక్కలు మెట్లెక్కగానే వసారా. సింహద్వారం దాటుకోగానే ప్రొప్రయిటరు కూర్చునే తావు. దానికావైపున పెద్దహాలు. అందులో బల్లలు, కుర్చీలు, మనుష్యులు ప్లేట్లచప్పుడు స్పూన్లగలగలలు—షరా మామూలు! కుక్క వేషం వేసినవాడు కుక్కలా వుండడం అబ్బురమా! సహజమే! లేదంటె ఆ కుక్కల్లో గూడా ఆల్సేషియన్ కుక్కలా ఆ హోటలు గొప్పదిగానే కనిపిస్తోంది. కాని సినిమాల్లో మనం యింతకన్నా బ్రహ్మాండమైన హోటళ్లను చూస్తున్నామే! 'విద్య గలవానికెందును వింత లేదు' అనేవాళ్లు పూర్వం. ఇప్పుడలా కాదు. సినిమాలు చూచే వాళ్లకిప్పుడేదీ వింత కాదు.

ధీమాగా లోపలికి నడచి వెళ్లాడు రామానుజం. అడ్వాన్సు చెల్లించి రసీదు పుచ్చుకున్నాడు. రూంనెంబరు యిరవై ఒకటి అన్నాడు ప్రొప్రయిటరు. అద్దెగదులున్నది మేడపైన. ఇకపైన వెళ్లడమే తరువాయి. కానీ రామానుజం కదలడే! అతడెందుకో ఉన్నట్టుండి బిర్ర బిగుసుకపోయాడు. ఆ జడత్వానికి తోడూ అనిమిషత్వం గూడా సిద్ధించింది. అతడంతగా ప్రూన్పడిపోవడానికి కారణమేమై వుంటుందో నా వూహ కందడంలేదు. ఆరెప్పపాటు లేని కళ్లలో నుంచీ వెలువడుతున్న చూపులు అలా సూటిగా వెళ్లి హోటలు ప్రొప్రయిటరు ముఖంపైన ముసురుకుంటున్నాయి. ముఖాన్ని పద్మంగా, దానిపైకి ప్రసరిస్తున్న చూపుల్ని తుమ్మెదలుగా వర్ణించడం సాంప్రదాయం. హోటలు ప్రొప్రయిటరు ముఖం పద్మంలా కాదు సరికదా, పొట్ట్లు తలకాయకంటే అందంగా లేదు!

ఎదుటి వ్యక్తికి చెవుడులాంటి దేదైనా వుందేమోనన్న సందేహం కలిగి వుండాలి హోటలు ప్రొప్రయిటరుకు! 'రూం నెంబర్ ఇరవై ఒకటండీ!' మరింత బిగ్గరగా అన్నాడు.

భుజంపైన చేయి వేసి ఒకటి రెండు సార్లు కదిలించిన తర్వాతగానీ రామానుజం పరధ్యానం నించీ కోలుకోలేదు. సోపానాల వరకు యించుమించుగా అతణ్ణి లాక్కెళ్లినంత పని చేశాను. అప్పటికీ మేడ మెట్లెక్కుతూ గూడా మధ్యలో ఒకసారి వెనుదిరిగి ప్రొప్రయిటరువైపు చూచి 'ఇతగాణ్ణి ఎక్కడో చూచినట్టుందోయ్ గోపాలం' అన్నాడు రామానుజం.

చూచే వుండవచ్చు. కానీ అందువల్ల యిప్పుడొరిగేదేమీ లేదు. ఒరిగినా, ఒరగక పోయినా కొన్ని విషయాల పైన వృథాగా మానసిక శక్తిని వెచ్చించడం మానవుల స్వభావంలో ఒక విడదీయని లక్షణమై పోయినమాట నేను కాదనను. ఈ హోటలు ప్రొప్రయిటరును తానెప్పుడు, యెక్కడ చూచాడో జ్ఞప్తికి వచ్చేదాకా బహుశా రామానుజానికి అన్నం సహించక పోవచ్చు, నిద్రపట్టక పోవచ్చు.

గదిలోకి వెళ్లగానే రామానుజం కనిపించిన కుర్చీలో కూలబడ్డాడు. మునివేళ్ల క్రింద నలుగుతున్న క్రింది పెదవి, అరమోడ్పు కళ్లు, కుంచించుకుపోయి గీతలు పడిన నుదురు. యివన్నీ అతడు తీవ్రాలోచనలో మునిగివున్న సూచనలు తెలియజేస్తున్నాయి. నామట్టుకు నాకు అంతటి పెద్ద ఆలోచనలేవీ ఎదురుగావడం లేదు. చల్లగా ఆశ్రమం దొరికింది గనుక, హాయిగా నిద్రపోతే బాగుండునన్న ధ్యాస ఒకటే నన్ను ఆవరించుకుంటోంది.

దాదాపు ఒక అరగంట సేపలాగే గడిచి వుంటుంది. గదిలో ప్రవేశించిన అతిథులు యిలా యింతసేపు మౌనం వహించడం అక్కడి రివాజుకు వ్యతిరేకమేమో నాకు తెలియదు—ఒక వెయిటరు స్వయంగా తలుపులు తోసుకుని లోపలికి వచ్చి 'నమస్కారమండీ! ఏం పుచ్చుకుంటారో చెబితే తీసుకొస్తాను' అన్నాడు.

'మీ హోటలు ప్రొప్రయిటరు పేరేమిటి?' అన్నాడు రామానుజం.

వెయిటరు తెల్లబోయాడు. 'మా ప్రొప్రయిటరుగారి పేరాండీ! ఆయన్ని దాదా సుందర్రావు అంటారు...' అని అంతలోనే తన విద్యుక్త ధర్మాన్ని గుర్తుకు తెచ్చుకుని 'వేడివేడిగా సేమియా ఉప్మా వుంది. రవ్వలడ్డు ఉదయం చేసిందే...' అంటూ కొనసాగించాడు.

'నాకిప్పుడేమీ వద్దు. నీకేమైనా కావలిస్తే చెప్పవోయ్ గోపాలం!' అన్నాడు రామానుజం.

నాకూ ఏమంత ఆకలిగాలేదు. ఆ హోటలు సౌభాగ్యం చూస్తుంటే ఏమీ తినకపోయినా నాకు నిద్రపట్టేటట్టు

వుంది!'

వెయిటరు వెళ్ళిపోయాడు.

నేను నిద్రపోయి లేచేసరికి ప్రొద్దు బాగా పొద్దెక్కింది. స్నానం చేసి దుస్తులు మార్చుకుని రామానుజం బయటికి వెళ్ళడానికి ఉద్యుక్తుడై వున్నాడు.

'ముఖం కడుక్కో గోపాలం! క్రిందికి వెళ్ళి టిఫిన్ చేద్దాం' అన్నాడు.

'ఎందుకూ! ఇక్కడికే తెప్పించుకో కూడదా?' అన్నాను

'కాదులే! క్రింద కాస్త పనుంది' అన్నాడు.

ఆ పనేమిటంటే — క్రిందికి వెళ్ళిన రామానుజం నేరుగా ప్రొప్రయిటరుగారి బల్లదగ్గరకు వెళ్ళి అక్కడ కుర్చీలో కూర్చున్నాడు. 'ఏం కావాలండీ?' అని ప్రొప్రయిటరు అడగగానే 'మరేం లేదండీ! మిమ్మల్ని నేనెక్కడో చూసినట్టుంది' అన్నాడు.

'నన్నా! మీరు చూచారా?' అన్నాడు ప్రొప్రయిటరు — ఏంటో కంటె అసంగతమైన విషయం మరొకటి వుండదన్నట్టు!

'చూడ్డమే గాదు. మాట్లాడినట్టుగూడా జ్ఞాపకం! కానీ మనం ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఒకరికొకరం తారసిల్లామో బొత్తిగా జ్ఞప్తికి రావడం లేదు' అన్నాడు రామానుజం.

కళ్ళజోడు క్రిందికి పైకి ఆడించి, రామానుజం వైపు ఎగాదిగా చూస్తూ 'ఏవూరు మీది?' అన్నాడు ప్రొప్రయిటరు.

# నేను విూకు...

ఊరి పేరు చెప్పాడు రామానుజం. తానా పేరు వినడం జీవితంలో అదే మొదటిసారి అన్నాడు ప్రొప్రయిటరు. తాలూకా, జిల్లాల పేర్లు చెప్పినా లాభం లేకపోయింది. ఆ ప్రాంతాలకు తానెప్పుడూ రానేలేదన్నాడు ప్రొప్రయిటరు.

'వ్యాపారంపైన నేను వూళ్ళు తిరుగుతుంటాను. బహుశా పది పదిహేనేళ్ళు గడచి వుండవచ్చునేమో! మనం ఎక్కడో కలుసుకున్నాము. ఏదో విషయంపైన కొంత సంభాషణ కూడా జరిగింది. మీ ఆకారం నాకు బాగా గుర్తుంది...' అన్నాడు రామానుజం.

ఒకటినట్టు కూ నిజం! ఒక సారిచూస్తే మళ్ళీ మరచిపోవడానికి వీల్లేని ఆకారమే ఆ ప్రొప్రయిటరుది! పెద్దవాళ్ళు. చాప పాటి చేతులు. బానలాటి బొజ్జ. కూసి గడ్డము, ఉబ్బిన దవడలు. మధ్యలో తగ్గి యిరువైపులా తాటిమట్టల్లా పైకిలేచిన క్రాపింగు. ఏనూటికో, కోటికో అరుదుగా కనిపించే ఆకారవిశేషం అది! కానీ తన ఆకారానికంటే ప్రత్యేకతవున్న విషయం నాట్యంగా వెల్లడిగావడం దాదా సుందరరావుకు అట్టే రుచించినట్టు లేదు. ఆ ప్రసక్తి రావడంతో అతడి ముఖంలోని కాస్త కూస్త ప్రసన్నతగూడా మటుమాయమైపోయింది' 'ఐనా ఏమిటండీ మీరుచెప్పేది?




లోకంలో ఎందరినో చూస్తుంటాము. అందర్నీ గుర్తుంచుకుంటామా! కోటి లింగాలలో ఒక బోడిలింగానికి లెక్కా పక్కా వుంటుందా?'

మాట్లాడుతూనే కాలింగ్‌బెల్ నొక్కాడు సుందర్రావు వెయిటరు ముందుకు రాగానే 'వీళ్ళకేంకావాలో చూడరాదూ?...వెళ్ళండి సార్! అదిగో, అక్కడ రెండు కుర్చీలు ఖాళీగా వున్నాయి' అన్నాడు.

రామానుజం కిక్కురుమనకుండా లేచి నిల్చోవలసివచ్చింది. 'నువ్వు చెప్పడమేమిటి నేను చేయడమేమిటి' అన్నట్టుగా అతడు సుందర్రావు చూపెట్టిన కుర్చీలవైపు చూపులెన్నైనా త్రిప్పకుండా మేడమెట్లెక్కపోగాడు. గదిలో ప్రవేశించి ఏదో కసి గొన్నవాడిలా ఒక బిర్రున కాలింగ్‌బెల్ ప్రయోగించాడు. పరిగెంచి వచ్చిన వెయిటరుకు దిగ్భ్రాంతి కలిగేటట్టుగా ఒక్క పెట్టున అయిదారు ఖాద్యపదార్థాలు తెచ్చి పెట్టమన్నాడు. తెచ్చిపెట్టిన వాటిని మెసవడంలో గూడా అతడి వీరావేశం వ్యక్తం కాసాగింది. ఉన్నట్టుండి ప్రారంభించాడు — 'చూచావా గోపాలం! నేను కోటి లింగాల్లో ఒక బోడి లింగాన్నట! ఇది ఆ దాదా సుందర్రావుగారు చెప్పిన మాట! అతగాడికి నేను గుర్తుండక పోవచ్చుననుకో! అందులో అబ్బురమేమీ లేదు. ఒకసారి చూస్తే మళ్ళీ మరచి పోకుండా వుండటానికి నాలో విశేషాలేవైనా వున్నాయా? నేను మామూలు సగటు మనిషిని! ఐనా ఆ మాట కాస్త సౌమ్యంగా చెప్పగూడదూ?'

'చెప్పలేదు. అందుకతన్నే మనం చేయగలిగిందీ లేదు' అన్నాను, ఆ అనవసరపు గొడవ కెలాగైనా ఫుల్‌స్టాప్ పెట్టాలన్న ఉద్దేశంతో.

కానీ నా పాయింటుతో రామానుజం ఏకీభవించినట్టు లేదు.

ఆ రోజు రాత్రి నిద్రపోయేదాకా నేను చూచాను. రామానుజం వాలకంలో మార్పు లేదు.

మరునాటి ఉదయం మరొకరకంగా తెల్లవారింది. నేను పడకపైన లేచి కూర్చునేసరికి నున్నగా గెడ్డం దువ్వుకుని, శుభ్రంగా టాయిలెట్ ముగించుకుని కిటికీలోనుంచి తోటవైపు చూస్తూ రామా

నుజం ఆనందంగా ఈలపాట ఊదేస్తున్నాడు. క్రిందటి రాత్రి మయసభనుంచి తిరిగివచ్చిన తర్వాత పరాభవ దందహ్యమాన మానసుడైన దుర్యోధనుడి పాత్ర లాంటిది ధరించి ఉక్రోషాన్ని వెళ్ళగక్కిన రామానుజం తెల్లవారేసరికి 'చింతామణి'లో ఈలపాట రఘురామయ్యలా తయారుగావడం ఆశ్చర్యకరమే !

'ఏమిటోయ్ రామానుజం! చాలా హుషారుగా వున్నావే!' అన్నాను.

'లే బావా గోపాలం!' అంటూ దగ్గరగా వచ్చి 'ఆ దాదా సుందర్రావుగాడు నా గుప్పిట్లో చిక్కాడులే గోపాలం! ఇక తప్పించుకోలేడు' అన్నాడు రామానుజం.

'సుందర్రావు నీ గుప్పిట్లో చిక్కాడా! ఎలా చిక్కాడు బాబూ?' ఆశ్చర్యంగా ప్రశ్నించాను.

'ఆ విషయం నీ కెందుకులే! అతడి నోటంట — అవునవును, మీరు నాకు గుర్తున్నారు — అని చెప్పించకపోతే నా పేరు రామానుజంగాదు...'

యుద్ధరంగానికి బయల్దేరుతున్న సాహసిక సైనికుడిలా వున్నాడు రామానుజం! వీరకుంకుమ పెట్టి రంగంలో దిగబెట్టడం నా బాధ్యత.

దాదా సుందర్రావుతో రెండవ భేటీ ఆ వుదయం ఏడున్నరకే ప్రారంభమైంది.

'నమస్కారమండీ సుందర్రావుగారూ! రాత్రి నేను నిద్రపోలేదంటే నమ్మండి...'

'ఈపాటి దుష్ప్రచారంతో ప్రారంభిస్తున్నారా? మంచిది. మంచిది. చెప్పండి ఎందుకు నిద్రపట్టలేదు?' — ద్వంద్వయుద్ధానికి సుందర్రావేనా వెనుదీసేవాడు!

'అబ్బే, అలాగని మీ హోటల్లో సౌకర్యాలు తక్కువనీగాదు నల్లులూ, దోమలూ లాంటి ఈతి బాధలూ లేవు. నాకు నిద్రపట్టక పోవడం మిమ్మల్ని ఎప్పుడో చూచానో జ్ఞప్తికి రాకపోవడం వల్ల...'

సుందర్రావు ఉలికి పడినట్టు తోచింది అందుకుతోడు అతడీసారి మరింత శ్రద్ధగా రామానుజాన్ని పరకాయించి చూస్తున్నట్టు కనిపించింది.

'పదిహేనేళ్ళ క్రితం. ఆ యేడు వర్షాలు పుష్కలంగా కురిశాయి. కృష్ణా, గోదావరి సంగతి మాట అడక్కండి! రాయలసీమలో కూడా భారీ వర్షాలు పడి చెరువులన్నీ మరవలు పోతున్నాయి. దేశం పచ్చగా వుంది. ప్రకృతి పచ్చగా కన్నులకు విందుగా వుంది...'

'ఆలాగా! కథలో మొదటి సీన్లాగవుంది. చాలా బాగుందండీ! చెప్పండి, చెప్పండి — అది పూర్తిగా తెచ్చికోలు ఆసక్తి మాత్రం గాదు.

'అలాంటి కాలంలో ఒకనాటి ఉదయం

# నేను విూకు...

అయిదు గంటలకు ఒక బస్సు మదనపల్లె నుంచి చిత్తూరికి బయల్దేరింది. బస్సెక్కినప్పటికి బయట చీకటి, చలీ గూడా దట్టంగానే వున్నాయి. బాగా ముసుగు దన్నుకుని కూర్చున్నానేమో నిద్రపట్టింది. పుంగనూరు బస్ స్టాండులో నేను కళ్లు తెరిచి చూచేసరికి భళ్లున తెల్లవారింది. ఎట్టఎదుటి సీటులో మీరు కనిపించారు.'

'మదనపల్లె—చిత్తూరు బస్సా!' సాలోచనగా అన్నాడు సుందర్రావు—'ఉండొచ్చు. నేనా రూట్‌లో ఒకటి రెండుసార్లు పయనం చేసి వున్నాను.' తగ్గుట హెచ్చుట కొరకే నన్నట్టుగా వెంటనే రికార్డు మార్చి పెట్టాడు. ఏమైనా ఆ ప్రయాణాల్లో మీలాంటి వ్యక్తి నాకెన్ని చూచినట్టు మాత్రం గుర్తు లేదు...'

'మీరా మాటంటారని నాకు తెలుసు!' రామానుజం ముఖంలో యిప్పుడు కోపం లేదు. ఉక్రోషం లేదు. మందహాసకాంతులే తాండవిస్తున్నాయి— 'అందుకని ఒకటి రెండు ఆధారాలుగూడా తీసుకొచ్చాను...'

'ఆధారాలా! అవేమిటయ్యా మహానుభావా!' రెచ్చిపడి పోతున్నాడు సుందర్రావు.

'పుంగనూరు బస్ స్టాండులో మీరు 'దిగివెళ్లి కాఫీ త్రాగిరావడానికి టైముంటుందా?' అని అడిగారు. 'అబ్బె, లేదండి! లేటైపోయింది' అన్నాడు కండక్టరు. 'పలమనేరులో తీసుకుందురుగానిలెండి! అదే ఈ బస్సుకు టిఫిన్ స్టాపింగు' అని నేనన్నాను. 'పలమనేరులో మంచి హోటళ్లుంటాయా?' అని మీరడిగారు. 'ఒకపూట టిఫిన్‌చేసే భాగ్యానికి మంచిహోటళ్లే వుండితీరాలన్న అవసరం ఏముందండి? ఏమాత్రం హోటలున్నా మన అవసరం తీరిపోతుంది' అన్నాను. అప్పుడు మీరు మదరాసులో అయ్యర్లు నడిపే హోటళ్లు, అక్కడ పద్ధతులు, ఆ వంటకాల రుచి అదంతా సవిస్తరంగా చెప్పసాగారు. అనగా అర్థమేమిటంటారా? ఇప్పుడీ హోటలును యింత చాకచక్యంగా నడపగలుగుతున్న మీ నైపుణ్యం ఆనాటికే మీలో బీజప్రాయంగా దాగివుందన్నమాట!'

దాదాసుందర్రావు పకిలినవ్వు నవ్వసాగాడు—'బలేవారండీ మీరు! 'రాజుగారి తల్లి పతివ్రత' అంటూ స్టేట్‌మెంటు యిచ్చి, చేతనైతే దీన్ని ఖండించమన్నాడంట ఒక బుద్ధిమంతుడు. అలాగే వుంది మీ ఆధారం! ఇలా నేను మాట్లాడి వుండనని నేనైనా చెప్పలేను. ముందరి కాళ్లకు బంధం వేయడమంటే ఏమిటో నాకిప్పుడర్థమైంది. పోనీ, మీరెండో ఆధారమేమిటి?'

'బస్సు పుంగనూరు విడిచి పరుగిడుతోంది. అక్కడొక మిట్టపైన తట్టలతో, బుట్టలతో కోళ్లతో, కుక్కలతో ఎక్కడికో వెళ్తున్న సుగాలీల తండా ఒకటి బస్సుకెదురైంది. నీటివాలు వల్లాన్ని చూసుకున్నట్టుగా మీ ప్రసంగం సుగాలీ అందచందాలపైకి మళ్లింది. పాపం, సుగాలీ స్త్రీలు దేశద్రిమ్మరులు! భగవంతుడు వాళ్లకంతటి అందచందాలు ప్రసాదించి వుండకూడదని మీరన్నారు. డబ్బును దాచుకోడానికి బ్యాంకులున్నట్టుగా తమ అందచందాలను కాపాడుకోగలిగే గుండెబలం సుగాలీస్త్రీల కుందని ఎవరో మీకు ఊరట చెప్పారు. అప్పుడు మీరు మదనపల్లె బజారులో మీ కెదురైన ఒక రసవత్తర సన్నివేశాన్ని గూడా వివరించినట్టు గుర్తు! అదేమిటంటే, మీరు బజారుగుండా వెళ్తుండగా నలుగురు సుగాలీ స్త్రీలు మిమ్మల్ని చుట్టుముట్టారు. ఎలా ఒక రూక పారేసి వెళ్లమన్నారు. మీరు రూకలివ్వడానికి వెనుదీయలేదు. కానీ రూక అంటే ఎంతో మీకు తెలిసిందికాదు. పోనిమ్మని జేబులోనుంచి ఒక రెండు రూపాయలనోటు తీసి చిల్లర లేదన్నారు. ఆ నోటు కాస్తా లాక్కుని, చుబుకాన్ని పుణికి, ఆ వ్రేళ్లతోనే మీ బుగ్గల్ని గూడా తాకి ముద్దెట్టుకున్నట్టు అభినయిస్తూ వాళ్లు చక్కా తమ దారివెంట తాము వెళ్లిపోయారు...'

'మహానుభావా! తమకూ, తమ ఆధారాలకూ ఒక నమస్కారం! సాధారణంగా నిన్న జరిగిన విషయం నాకీవేళ జ్ఞప్తిలో వుండదు. పదేళ్లక్రితం నేనొక బస్సు ప్రయాణంలో సుగాలీ స్త్రీల అందచందాలను గురించి మాట్లాడానా! బాగుంది బాబూ, బాగుంది! నమ్మడానికి వీల్లేకపోయినా చాలా యింటరెస్టింగుగా వున్న మాట కాదనలేను. తరువాత ఏం జరిగింది సార్?'

రామానుజం యింక నీళ్లు నమలక తప్పదనుకున్నాను. కానీ కొన వూపిరి వున్నంతవరకూ కర్తవ్యాన్ని విడనాడని వీర యోధుడిలా ఒక చిట్టచివరి ప్రయత్నం చేయదలచుకున్నట్టు అతడు మళ్లీ నోరు తెరిచాడు.

'ఆ ప్రయాణానికి సంబంధించి నాకింకొక్క విషయం మాత్రం జ్ఞాపకం వుంది. చెప్పమంటే చెబుతాను...'

'చెప్పండి సార్, చెప్పండి! భేషుగ్గా చెప్పండి. మీ గొంతుక వాల్యూము గూడా సంతృప్తికరమే! రేడియో టాకులా హోటలుకంతా వినిపిస్తోంది. కొనసాగించండి...'

బస్సు పలమనేరు దాటింది...'

'నికరమైన నిజం చెబుతున్నారు, బస్సు ఒక గమ్యస్థానాని కంటూ బయల్దేరిన తర్వాత మధ్యలో ఏవో కొన్ని వూళ్లు దాటవలసిందే!'

రామానుజం సుందర్రావు పెళుసు మాట వినిపించుకున్నట్లే లేదు.

'అప్పటికి వారంరోజులనుంచీ రోజుకొకటి రెండు వానజల్లులు పడుతున్నాయి. దేశం చల్లగావుంది. ఆరోజు తెల్లవారిందన్నమాటే గానీ, సూర్యుడు కనిపించే జాడలు లేవు. ఆకాశాన దట్టంగా మబ్బులు వ్రేలాడుతున్నాయి. బస్సు పలమనేరులో వుండగానే తుంపరగా చినుకులు రాలడం ప్రారంభమైంది. పది నిమిషాల్లో అది జడివానగా మారింది. మింటికీ మంటికీ ఒకటే కుండపోత. కొండలూ, కోనలు రేఖామాత్రంగానైనా కానరావడం లేదు. అది బస్సుగాదు. సబ్‌మెరీన్‌ను తలపిస్తోంది. డ్రయివరు సమర్థుడనే చెప్పాలి. జాగ్రత్తగా, వీలయినంత వేగంగానే ముందుకు దూసుకపోతున్నాడు. బస్సలా అయిదారు మైళ్లదూరం మాత్రం పరుగెత్తి వుంటుంది. ఆఖరుకొకచోట డ్రయివరుకే విసుగెత్తిందో, యింజనే హఠం చేసిందో బస్సు తటాలున ఆగిపోయింది...'

'మిగిలిన కథ పైవారం చదవమంటారటండీ?' ఛలోక్తి విసిరినాడు సుందర్రావు. అల్లంతదూరంలో ఉపాహారం సేవిస్తున్న ఒక పెద్ద మనిషి.

'అబ్బె ఎందుకండీ! చివరి ఘట్టంలోకి వచ్చేస్తున్నాను...' కొనసాగించాడు రామానుజం—'అరగంట సేపలా కురిసిన తర్వాత హఠాత్తుగా వాన వెలిసింది. జడివానలో పరదాలు వ్రేలాడుతుండడం వల్ల తెలిసిందికాదు గానీ, బస్సొక వూరి

దాపున ఆగివుంది. ఆ వూరు కాస్త పెద్దదే! ఉన్న పెంకుటేళ్లు, పూరి పాకలు, తడిసి ముద్దైన బొంతగద్దల్లా వున్నాయి. ఊరి కవతలివైపు అంచున ఓ దేవాలయముంది. అక్కడొక దేవాలయం వున్నందుకు గుర్తు ఎత్తుగా కానవస్తున్న గాలిగోపురం. అది నల్లగా వుంది. గంభీరంగా వుంది. ఇలాంటివానలు నాకొకలెక్కా అన్నట్టు నిర్లిప్తంగా వుంది. గుళ్లూ, గోపురాలు అవశ్యం దర్శనీయాలే! కానీ అవకాశం వుండాలిగదా! ఇంజను రిపేరు కావడానికింకొక అరగంట పట్టవచ్చునని డ్రయివరు చెప్పకుండావుంటే, ప్రయాణీకులకా దేవాలయాన్ని చూచి రావాలన్న ఉద్దేశం కలిగివుండేది కాదేమో...'

'ఉండండుండండి! గుడిని చూడ్డానికి బయల్దేరిన ప్రయాణీకుల్లో నేనున్నానో లేదో తెలుసుకోవాలి. మొదట స్వవిషయం. తరువాత యితరుల సంగతి. ఇంతేనండీ నా పాలసీ...'

'నా కప్పుడనిపించింది. నున్నగా ఒక జారుడుగుట్ట వుంది. సుందరావు దానిపైన నిలుచున్నాడు. నేలపైనవున్న రామానుజానికి అతడి నెలాగైనా క్రిందికి లక్కురావాలని ఉద్దేశం. పైకెగబ్రాకడానికి ప్రయత్నిస్తున్నాడు. అంతలోనే జారిపోవలసి వస్తోంది.

ఐనా ప్రయత్నం విడనాడడం లేదు!

'అది శివాలయం. సింహద్వారం మూయబడివుంది. బిల్వవృక్షం కొమ్మలు, ధ్వజస్తంభం గంటలుమాత్రమే వెలుపలికి కనిపిస్తున్నాయి. ఇంతకూ అక్కడ చూడదగ్గ విశేషం గుడిలోపల లేదట. దేవాలయం వెలుపలే వుందన్నారు. అదొక నందీశ్వరుడి విగ్రహం. నందినోటిగుండా ఎడతెగకుండా జలధార స్రవిస్తోంది. ఆ నీరు కోనేటిలోకి ప్రవహిస్తోంది. కోనేటి నిండుకూ తామరపువ్వు లున్నాయి...'

'అబ్బో, చాలా సుందర దృశ్యమేనే!' ఈ పారిగూడా రెస్పాన్సు శ్రోతల్లోనుంచే వచ్చింది. సుందర్రావు ఉలకలేదు. పలకలేదు.

పరిస్థితి యింత నిరాశాజనకంగా వున్నా రామానుజం బొత్తిగా నిరాయుధుడైపోయిన లక్షణాలు కనిపించలేదు. ద్విగుణీకృతోత్సాహంతో అతడు 'అంతలో బస్సుహారన్ వినిపించింది' అన్నాడు.

సుందర్రావు ఉలికిపడ్డాడు. కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ టేబిల్ పైకి వంగాడు.

'ప్రయాణీకులందరూ గబగబా రోడ్డువైపు పరుగెత్తడం ప్రారంభించారు. వర్షం కురుస్తున్న సంగతి యిదివరకే చెప్పాను. ఆ ప్రదేశంపైకి చూడ్డానికి నల్లరేగడిలా కనిపిస్తుంది. మట్టిలో బంకదనం హెచ్చుగా వుంది. అందుకు తోడూ దారిపొడుగునా అడ్డనుగుంతలు...'

'ఉండండి సార్! నాబుర్ర పనిచేయడం మొదలెట్టింది! గుర్తుపట్టేశాను...'

'పరవాలేదు. మరికొంచెం చెప్పనివ్వండి...'

'ఎందుకూ! అనవసరం. చిత్తూరులో బస్సుదిగిన తర్వాత మనం కలిసి ఒక హోటలుకుగూడా వెళ్లాం. అడ్రసులు మార్చుకున్నాం. మీరొకజాబు వ్రాసినట్టుగూడా జ్ఞాపకం. పనుల తొందరలో నేను మీకు బదులిచ్చానో లేదో గుర్తులేదు...'

'కానీ ఇంకొక ముఖ్యమైన సంఘటన...'

'ఆ ప్రయాణం ప్రయాణమే ముఖ్యమైన సంఘటన! మరపుకొచ్చేదేనా అది! ఏదీ, ఒరే అబ్బాయ్! రెండు పెసరట్లు స్పెషల్ పట్టుకురా. ఆలోగా పొంగల్ రెండు ప్లేట్లు...మరేమనుకోకండి సార్! మళ్లీ చాలా కాలానికి కలిశాం! ఈ రోజంతా మీరు నా ఆతిథ్యం స్వీకరించాలి...'

* * *

ఆఖరుకు సుందర్రావు రామానుజం గుప్పిట్లో చిక్కాడు!

ఈ అద్భుతకం ఎలా సాధింపబడినట్టు? అదే నాకు అంతు చిక్కడంలేదు.

గదిలో ఏకాంతం దొరకగానే ప్రశ్నించాను:

రామానుజం నవ్వాడు: 'ఏముంది చాలా సింపుల్. వాయువ్యాస్త్రం, వరుణాస్త్రం, నాగాస్త్రం...అన్నీ వమ్మయిపోయాయి. కానీ నా దగ్గర నారాయణాస్త్రం గూడా వుంది. సంధించబోతున్నానని తెలియగానే సుందర్రావు చిత్తయిపోయాడు...'

ఈ సాంకేతిక భాషగూడా నాకు బొత్తిగా అర్థం గావడంలేదని చెప్పుకోడం కన్నా గత్యంతరం లేకపోయింది.

'మరేంలేదు గోపాలం! ఆ రోజు గుడి దగ్గరినుంచీ రోడ్డువైపు పరుగెడుతూ సుందర్రావు కాలుజారి ఓ బురద గుంటలో బోర్లగిల పడ్డాడు. పైకి లేచేసరికి అతడు మనిషికాడు. ఆ వేషంతో బస్సుదగ్గరికి రానూ లేదు. అలాగని అక్కడ దాక్కుని కూర్చోనూ లేదు. అప్పుడతనికి సోదర మానవుడి తోడ్పాటు కావలిసి వచ్చింది. బస్సును మరికొంతసేపు నిలిపిపెట్టడం, కోనేట స్నానం ముగించేసరికి దుస్తులు తీసుకెళ్లియివ్వడం — యిలాంటి చిన్న సహాయాలే ననుకో! కానీ సన్మానాలను, అభిమానాలను, అవమానాలను మరచిపోయేటంత తొందరగా మానవుడు తన అవమానాలను మరచిపోయేటట్టు లేడు. అదీ సంగతి!' పకాలున నవ్వేసాగాడు రామానుజం! ●






# పరివిష్కారం



సీరియల్

శిఖా వెంకటరమణ

### జరిగిన కథ

జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తు పడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. రాజశేఖరం జయని పెళ్లి చేసుకోమని కాళిదాసుని అడుగుతాడు. భారతికి అన్యాయం చెయ్యడం అతనికి ఇష్టంలేదు. జయ సాంబుని గుర్తుపట్టినట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు. మార్గరెట్ సాంబుచేత తిరస్కరింపబడి స్వదేశానికి వెళ్లిపోతుంది. కాళిదాసు భారతి భార్యాభర్తలవుతారు. జయ గర్భవతి అవుతుంది. కాళి సాంబుకోసం వెతుకుతాడు. అతను దొరకడు. జయ ప్రసవించగానే బిడ్డ మరణించాడు. కాళిదాసు కొడుకునే తన స్వంత కొడుగ్గా పెంచుకుంటుంది.

## 9

జయ తన దురదృష్టానికి యేడవని నిమిషం లేదు. కళ్లు మూసుకున్నా తెరిచినా సాంబశివం ప్రతిమ కళ్లయెదుట నిలబడి 'జయా! నా జయా!' అంటూ యెలుగెత్తి పిలుస్తున్నట్లనిపిస్తుంది. కళ్లుతెరచి వాస్తవానికి రాగానే 'నేనా! యిదేమిటీ యిలా యెందుకైపోయేను? సాంబశివం యేడీ...యిదంతా నిజం కాదా!' అని పరిపరివిధాల వాపోతుంది. భారతి వోదార్పు మాటలుగానీ, రాఘవరావుగారి అనునయ వాక్యాలుగానీ వుపశమనం యివ్వవు. రఘురామ్ స్కూల్‌నుంచి వస్తూ 'యింకా యిలాగే కూచున్నావేం పిన్నీ తమ్ముడు యేడుస్తున్నాడు. నువ్వు వినవేం' అని కుదిపికుదిపి లేపుతాడు. వులిక్కిపడి వాడిని వూరడించే ప్రయత్నంలో వుండిపోతుంది.

రఘురామ్ వాడు ఆడుకునేందుకు కావలసినన్ని గోళీలు యిస్తాడు. వాడికి చేతనైనా కాకపోయినా గిల్లీకర్ర యిస్తాడు. తనతో సమానంగా వాటా వేసి గాలిపటాలు యిస్తాడు. తమ్ముడంటే వాడికి తగని ఆపేక్ష. తమ్ముడు నోట్లోంచి యేడుపు శబ్దం వినకుండా ముందే పరుగెత్తి వాడికి కావలసింది యిచ్చేస్తాడు.

జయకి ప్రాణం రఘురామ్ అయితే వాడి పంచప్రాణాలూ తమ్ముడి మీదే వుంటాయి. తల్లి డ్యూటీలోంచి రాగానే 'అమ్మా తమ్ముడు నీకోసం యేడుస్తున్నాడమ్మా' అంటాడు. సాయంత్రం కాగానే రాఘవరావుగారి గదిలోకి యిద్దరూ ప్రవేసించి షికారుకోసం ప్రాణం తీస్తారు.

జయ తన్ను తాను మరిచిపోయే ప్రయత్నంలో చాలాకాలం క్లినిక్‌లోనే వుండిపోయేది. ఇంటిదగ్గరవున్నా భారతికి ఎక్కువగా సహాయపడుతూండడం చేసేది. ఆ రోజు రాఘవరావుగారు మంచంమీద ఆరుబయట పక్క వేసుకుని పడుక్కున్నారు. జయ కొద్దిసేపు తటపటాయించి చివరకు ఆయనకి దగ్గరగా వచ్చింది. పిల్లలిద్దరూ చెరోపక్కా పడుకున్నారు. వెన్నెల ప్రపంచంలోకి పిండారబోస్తున్నట్లు ప్రసరిస్తోంది. చల్లటి గాలి మనసుని హాయిపరుస్తోంది. మేడమీది గదిలో కాళిదాసు దీపం ముందు కూర్చుని యేదో పుస్తకం తిరగేస్తున్నాడు. భారతి వంటయింటి తలుపు వేసిన శబ్దం కూడా వినిపించింది.

ఆయన కళ్లుతెరిచి యిటుచూసి 'ఏం తల్లీ యింకా నిద్రపోలేదూ' అన్నారు.

'బాబాయ్' జయ దుఃఖాన్ని దిగమింగుతున్నదానిలా అన్నది: 'మీరు యెంత సహాయం చేశారు. మీరే తలుచుకుంటే చేయలేనిదంటూ లేదు. నన్నుకూడా స్టేట్స్ పంపకూడదా?'

'పిచ్చితల్లీ!' ఆయన వేడి నిట్టూర్పు వదిలేరు. 'నువ్వు వెళ్లేందుకు వీలు లేదమ్మా. రఘురామ్ బెంగపెట్టుకుంటాడు' ఆయన అస్త్రాన్ని ప్రయోగించేరు.

'హు రఘురామ్' నిర్లిప్తంగా అన్నది జయ: 'లేదు బాబాయ్. నా ప్రాణానికి వాడు వక్కి యెర. అంతే వాడూ పెద్దవాడౌతున్నాడు. చిన్నతనంలోవుండే ప్రేమానురాగాలు యిప్పుడు అంతగాలేవు. నేనే అన

వసరంగా వాడికోసం ప్రాకులాడుతున్నాను. అంతరంగతరంగా భారతి ఒకవేళ బాధపడి కాదు.

వాడి ప్రశంసిస్తే వేరు. తమ్ముడా, అమ్మా, నాన్నా... ఈ లోకంలో నా పాత్ర యెంత? నీకు తెలీదా బాబాయ్'

'పొరబాటు పడుతున్నావు జయా! నువ్వు క్షణం కనిపించకపోయేసరికి వాడు యెంత తల్లడిల్లిపోతాడో నీకు తెలుసునామ్మా'

జయ మౌనం వహించింది.

జయ జీవితం కలతనిదురలా అయిపోయింది. రాత్రిళ్లు నిద్రరానంతసేపూ పుస్తకాలు తిరగేస్తూ, విసుగనిపించినపుడు కాలుకాలిన పిల్లిమాదిరి యింట్లోంచి బయటికీ, బయటినుంచి యింట్లోకి తిరుగుతూంటుంది. అలా కాని పక్షంలో గది కిటికీలోంచి శూన్యాకాశంలోకి చూస్తూ సాంబశివాన్ని గురించి తలపోస్తుంది. సాంబశివం నీది ప్రేమా! అదే నిజం అయితే ఒక్కసారి రాకపోయేవాడివా రాఘవరావు గారిని చూసేందుకు. ఆయనదగ్గరికి వస్తే మా వివరాలు తెలిసేవి కద! నేను స్పృహ లేకుండా నీకే లొంగిపోయేననే విషయాన్ని నువ్వు నమ్మగలవా? ఈ నిద్రలో యెక్కడెక్కడికో వెళ్లానని నువ్వు నామీద అపవాదు వేస్తావా? ఎన్నాళ్లీ చీకట్లో వెలుగుకోసం ప్రయాసపడుతూ ప్రయాణం చేయను? గమ్యం తెలీని ఈ యాత్ర నాకెంత దుర్భరంగా వుంటుందో ఏ ఒక్కరూ ఆలోచించరేం? మనిషి, స్పర్శా, ఇలాంటివేమీ యెరుగని దారుణమైన స్థితిలో ఆహుతై పోయేనే? భగవాన్! యెందుకీ శిక్ష విధించావు? యెవరిపట్ల యింత కర్కోటంగా ప్రవర్తించి వుంటాను? పూర్వజన్మలో యెవరినో యెందుకో కష్టపెట్టి యిప్పుడిలా అతిభయంకరమైన తుపానుకి చిక్కుకుని తీరం దొరకక విలవిల్లాడిపోతున్నానా?

సాయంత్రం స్కూలునుంచి వచ్చిన పిల్లలకి దగ్గరుండి టిఫిన్‌పెట్టి కాఫీ ఇవ్వడం జయకి యిష్టమైన పనులలో ఒకటి. మోహన్ పరీక్షగా జయవైపు చూసి వుండబట్టలేక అన్నాడు: 'ఎప్పుడూ నువ్వే పెడతానంటావేం పిన్నీ మమ్మీ యేదీ?'

జయ ఆశ్చర్యంగా చూసింది వాడివైపు. యిన్నేళ్లలో వాడు యెన్నడూ ఈ ప్రశ్న వేయలేదు. తన బిడ్డల్ని మమతపేర బంధించి తననుంచి దూరం చేస్తున్నందుకు

ఆ విషయం మాటమాత్రంగా అని వుండలేదు కద. అంతే ఆ తరువాత జయ డైనింగ్ టేబిల్ జోలికి రాలేదు. యెంతమంది యెన్నివిధాల వోదార్చినా, తను పోగొట్టుకున్నది తిరిగి సంపాదించలేదు. పదేళ్ల పిల్లలు బొంగరాలమాదిరి ఆట



స్థలంలో ఆడుకుంటూ వుంటే జయ మాతృహృదయంమీద గురిచూసి భగవంతుడు వ్రేటు వేసినట్లు కుప్పలా కూలిపోయి బాధపడుతుంది. తనకురానే యెన్నోవిధాల ఈ బ్రతుకుని సరిపెట్టుకోవాలనుకుంటుంది. అయినా అది జయకి సాధ్యం

రోజులు గడుస్తూంటే జయలో భవిష్యత్‌మీది ఆశ హారతి కర్పూరంలా హరించిపోసాగింది. సాంబశివం ఈ జీవితంలోనే కనిపిస్తాడనే ఆశ అడుగంటిపోయింది. జయలో నిరాశ స్థిరంగా పేరుకుపోయింది. మోడులాంటిజీవితాన్నిగడిపేసాహసంపూర్తిగా సన్నగిల్లి పోయింది. జయ జీవనజ్యోతి ఆరిపోయింది. బ్రతుకులో ప్రారంభంలో ఉధృతంగా వినిపించిన విపంచి లీగెలు అర్థరహితంగా తెగిపోయేయి. ప్రకృతిని వోలలాడించే వీణ పగిలిపోయింది.

* * *

మనమంతా పిక్‌నిక్ ప్రోగ్రాం వేసుకున్నాం మీరు రావాలి', హోళ్లీ పది పది హేనుమంది భారతిని బలవంతం చేస్తున్నారు.

'నాకు తీరికలేదు. ప్రొద్దుటే యింటి పనులు ఆ పైన క్లినిక్ వ్యవహారాలూ యివన్నీ నేను స్వయంగా దగ్గరుండి చూసుకోక పోతే చాలా నష్టం వస్తుంది. నన్ను బలవంతం చేయకండి ప్లీజ్' భారతి నెమ్మదిగా అన్నది.

'నువ్వు రాకపోతే మీ చెల్లెల్ని పంపు. యేం తనుకూడా రాకూడదా'

'అయ్యో!' భారతి నొచ్చుకుంటూ అన్నది: 'మేము యెప్పుడూ వెళ్లద్దన లేదే యింతవరకూ. అయినా దానికి వేటి మీదా యింటరెస్టు వుండదు'

'అక్కడికి అందరికీ పుట్టుకతోటే వచ్చినట్లు మాట్లాడుతున్నావోయ్ భారతీ'

'నేనేం అతిశయోక్తిగా మాట్లాడడం లేదు భానూ! మా జయకి పిక్‌నిక్‌లూ పార్టీలూ యిలాంటివి నచ్చవు. దాని ప్రపంచమే వేరు'

'ఓ', భాను యెగతాళిగా అంటున్నట్లు అన్నది; 'పోనీ ఒక్కసారి మాతోకలిసి మా ప్రపంచంలోకి జొరబడే ప్రయత్నం చేయమను. ఆ పైన మీ జోలికి రాదు'

భారతి మాట్లాడలేదు. జయ గది లోంచి బయటికి వచ్చేసి పరిచయం వున్న వాళ్లతో చిరునవ్వు నవ్వుతూ: 'మా అక్క అలాగే అంటుంది. పదండి వెడదాం' అన్నది.

భారతి కళ్లు వెడల్పయ్యేయి. ఆశ్చర్యంగా జయని చూస్తూండి పోయింది. పిక్‌నిక్ ప్రోగ్రాం స్థిరపడింది. కాళిదాసు ఆ సమయంలోనే ఫోన్ చేశాడు. అతని ఆశ్చర్యానికి హద్దుల్లేవు. తమతో 'సినిమాకైనా రాని జయ ప్రపంచంతో పడుతోం దంటే అతనిశరీరం పులకరించి పోయింది: 'పోనీలే భారతీ. జయ యెక్కడికి వెళ్లినా అభ్యంతరం చెప్పేందుకు మనం ఫూల్స్ కాకూడదు', అంటూ తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు.

ఆదివారం కావడం మూలాన స్వంత పనులన్నీ త్వరగా తెముల్చుకుని ప్రయాణం అయేరు. భానుమతి, సరళ, జయా కాకుండా మరో ముగ్గురు అపరిచిత

# పరిలిప్తం

వ్యక్తులు కలిశేరు. భానుమతికి పెళ్లి అయి పిల్లలున్నా యెంతో చిన్నదానిలా నలుగురిలో నవ్వుతూ, తుళ్లుతూండడం జయకి ఆశ్చర్యంగానే వున్నది. అయినా ఆ మాటని పైకి అనలేకపోయింది. పిక్‌నిక్ నుంచి సాయంత్రం వస్తూ వస్తూ సరళ యింట్లో ఆగిపోయేరు కాఫీల కోసం. జయ పిక్‌నిక్‌కి ఆ తరువాత పార్టీకి వచ్చిందనే పేరుగానీ నిశ్శబ్దంగా వుండిపోయింది. హృదయంలో లేని సంతోషం పరిసరాలు కల్పించలేవు బహుశా.

టేబిల్‌చుట్టూ కూర్చుని కబుర్లతో, కేరింతలతో, నవ్వులతో హాలు దద్దరిల్లేట్లు రభస చేస్తున్నారు. జయలక్ష్మి మౌనం వహించి చూస్తోంది. సరళ యింట్లో వృద్ధురాలు ఒకావిడ తప్ప మరెవరూ వున్న జాడలేదు. అంత విశాలంగా వున్న ఆ యింట్లో ఒక్క మనిషికి యెలా గడుస్తుందో కాలం అంతు చిక్కలేదు. గడపలో బూట్ల టకటక శబ్దం విని తలెత్తి అటువైపు చూశారంతా. ఒకరి వెనుక మరొకరుగా ముగ్గురూ లోపలికి వచ్చేరు. సరళ యెదురువెళ్లి నమస్కారంచేసి లోపలికివచ్చిన ముగ్గురినీ పరిచయం చేసింది. రామచంద్ర సి. ఐ. డి., గోపాల్ ప్రాక్టీసు చేస్తున్న లాయరు, మూడోవ్యక్తి మనోమోహన్ కృష్ణ రిసెర్చి స్కాలరు.

టేబిల్‌చుట్టూ కుర్చీలువచ్చి చేరాయి. 'గ్లాడ్‌టు మీట్‌యు', ఒక్కొక్కరి వైపే చూస్తూ నమస్కారం చేశారు ముగ్గురూ. ముగ్గురూ ఆజానుబాహులే. గోపాల్ తెలివితేటలకీ స్ఫురద్రూపి తనానికీ చిహ్నంగా అతని మొహంలో కొత్తరకం కళ వుట్టిపడుతోంది.

అందరిలోకీ మౌనంగా అంటీ ముట్టనట్లున్న వ్యక్తి మనోమోహన్ కృష్ణ.

సరళ నవ్వి అన్నది: 'యిక్కడకూడా యేమిటో ఆలోచిస్తున్నారు మీరు. అఫ్‌కోర్స్ అడగకూడదను కోండి. తప్పదు మరి. మా యింటికి వచ్చి మాతోబాటు యిందులో షేర్ తీసుకోకపోవడం యేం మర్యాద ?'

మనోమోహన్ కృష్ణ నవ్వి వూరుకున్నాడు.

'నాకు తెలుసును. యిక్కడ అందరినీ గుంభనగా స్టడీ చేయాలనే మీ వుద్దేశ్యం'

'ఛ! ఛ! మనోమోహన్ నవ్వి 'నే నందుకు రాలేదండి. జస్ట్ నేను బయలుదేర బోతూంటే, దార్లో రామచంద్ర కనిపించి యిలా తీసుకు వచ్చేడు.' అన్నాడు.

జయ చూస్తూ కూర్చుంది. అంతా అల్లకల్లోలం అయిపోయిన మహా సముద్రంలో దిక్కుతోచక కూర్చున్నట్లుగా వుంది. కొంచెం సేపట్లో రకరకాల తిను బండారాలతో చిక్కని పానీయాలు టేబిల్ మీద అమర్చబడి హాజరుగా వున్నాయి. ఆడా మగా భేదంలేకుండా గ్లాసులో పోసుకుని మధ్య మధ్య తింటున్న ఆ పదార్థాల వైపు చూస్తూంటే ఆశ్చర్యంగా జయ కళ్లు వెడల్పు కాసాగాయి. కాస్మాపాలిటన్. సి. ఐ. డి రామచంద్ర కళ్లు మత్తుగా గాలిలోకి తేలిపోసాగాయి. మనోమోహన్ దూరంగా కూర్చుండి జయవైపు ఒకటి రెండుసార్లు చూశాడు. చీకటి ముంచుకు వస్తోంది. యీవెనింగ్ పార్టీలో అందరు లీనం అయిపోయేరు. జయ నెమ్మదిగా లేచి 'నేను వస్తాను సరళా' అన్నది.

'వూఁ' కొట్టి వూరుకున్నారు అంతా. జయ వీధి మలుపు వరకూ రాలేదు పూర్తిగా, ఘొల్లున నవ్వులూ ఆ వెనుక ఈసడింపు వాక్యాలూ జయ చెవుల్లోకి దూరాయి.

'ఆవిడ పెద్ద గ్రంథకర్తలే. నీ కెందుకు మనోమోహన్ పెద్ద యింటరెస్టు చూపిస్తున్నావు?' సరళగొంతు అది.

జయ కాళ్లలో సత్తువలేని దానిలా, పటుత్వం పూర్తిగా పోయి నిస్త్రాణకి వచ్చేసిన స్థితిలో వున్నట్లూ బలవంతంగా కాళ్లు యీడ్చుకుంటూ టాక్సీస్టాండ్ వైపు చూస్తూండి పోయింది.

* * *

రాఘవరావుగారికి నానాటికీ శరీరంలో దారుఢ్యం తగ్గిపో సాగింది. ఆయన యిప్పుడు పూర్తిగా మంచంమీదే వుండి పోయేరు. ఆయన కూతుళ్లు విషయం విని వచ్చేశారు. పెద్దకూతురు రాజ్యలక్ష్మి, రెండోకూతురు శైలతా తండ్రిని చూసి కంట తడిపెట్టారు. ఆయన కూతుళ్లని చేరబిలిచి జనాంతికంగానే అన్నారు. నాకు స్వార్థం వున్నది కనుకే

కాళిదాసుని చేరదీశాను. తలకొరివి పెట్టేందుకో మనిషి, కొడుకైనవాడు కావాలి. ఎన్ని చదువులు చదివినా, యెంత విజ్ఞానాన్ని సంపాదించుకున్నా నేను కొన్ని ధర్మాలకి కట్టుబడిన మనిషిని. నాకు కూడా 'పున్నామనరకం' మీద నమ్మకాలున్నాయి. 'కాళిదాసూ!' ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'నేను యింక యెక్కువ కాలం బ్రతకను. సాంబశివం నాడు చెప్పింది అర్థం చేసుకున్నానని నీతో అన్నాను. వాడికి కూడా జయ పరిస్థితి తెలియదు. పెళ్ళి చేసుకుంటాననీ, ప్రేమించి, వాగ్దానం చేసిన పిల్ల అర్ధరాత్రి రావడం అతను మరో రకంగా అర్థం చేసుకున్నాడు. జయలక్ష్మి విధి చేతిలో కీలుబొమ్మ అయిపోయింది. తెలివి అతనికే వచ్చింది కానీ ఆపిల్ల యింకా స్వప్నవిహారి మాదిరే వుంది. మీరు వెళ్ళిపోయేరు. అతనిలో ఆత్మవిశ్వాసం చెప్పేందుకో తగ్గది. జయ నాకు సాంబశివం వప్పగించిన బాధ్యత.

కాళిదాసు ఆయన తలగట్టున కూర్చుని వింటున్నాడు. చివరి ఘడియల్లో ఆయన చెప్పే అంతిమ సందేశం యేమిటో వినాలనే కుతూహలం అతడిని కట్టివేసింది. వుండి వుండి కళ్ళల్లో కారే కన్నీటిని తుడుచుకుంటున్నాడు. పిల్లలిద్దరూ జయకి రెండువైపులా కూర్చుని బిక్క

# పరిత్యక్తం

మొహాలు వేసుకుని చూస్తున్నారు. భారతి నిమిష నిమిషానికీ ఆయనకి కావలసినవి అందించేందుకు సిద్ధంగా నిలుచున్నది. తండ్రి...తమని పెంచి పెద్దచేసి, లక్షాధికార్ల కోడళ్ళు చేసి. కష్టం అంటే యేమిటో యెరుగనివ్వకుండా, కంటిపాపలా చూసుకున్న ఆయన మరి తిరిగి రాని లోకానికి వెళ్ళిపోతున్నారంటే బావురుమన్నారు అక్కచెల్లెళ్ళిద్దరూ.

ఆయన కళ్ళు చెమర్చేయి: 'యేడవద్దు, నేను చచ్చిపోతున్నాననే బాధ నాకు కొంచెం కూడా లేదు. జయ గురించే నా ఆరాటం. చూడు జయా! ఈ ఆస్తి పాస్తులన్నీ నేను దానం చేశానంటే ప్రపంచం నవ్వుతుంది. నా బిడ్డలకి లోటు లేదు. కాళిదాసు యిన్నాళ్ళు నాదగ్గర పని చేసినందుకు అతనికి క్లినిక్ రాసి యిచ్చేను.'

'మిగిలిన ఆస్తి రెండు భాగాలు చేశాను. మైనార్టీ తీరే వరకూ ఆ ఆస్తిమీద వడ్డీ నీకు చెందుతుంది. పెరిగి పెద్ద అయేక రఘురామ్' మోహన్‌లు రాజ్యం కూతురు హిమబిందునీ, శైలత కూతురు మోహినినీ వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకోవాలి. వాళ్ళే తమ తమ దార్లు తాము చూసుకుంటే ఈ ఆస్తిపై వచ్చే వడ్డీ మామూలుగా నీకే చెందుతుంది.'

'చూడమ్మ జయా!' ఆయన రొప్పుతూ అన్నారు.

'నీతో యింత విచ్చలవిడిగా మాట్లాడడం నా దురదృష్టం. అయినా తప్పదు. ప్రపంచం పూరుకోదు.' నువ్విలాగే వుండి పోతానంటె.

కాలం మారింది. మారుతున్న కాలంలో మనంకూడా తప్పనిసరిగా మారిపోవాలి. జయ చెడిపోయింది. తప్పు చేసింది కాబట్టే పెళ్ళి చేసుకోలేదు. చాటుమాటు వ్యవహారాలు లేకుండా బ్రతుకుతున్నదా అని అందరూ అంటున్నారు. ఈ వార్త యింకా విజృంభించకూడదు. నువ్వు నా తల్లివి. సాంబశివం మంచివాడే కాదనను చెప్పేడు మాటలు విని చెడునే తలకియెక్కించుకుని అక్కడే వుండిపోయేడు. వాడు వస్తాడనే నమ్మకం నాకు లేదు. పెళ్ళి చేసుకుంటే యిన్ని బాధలుండవు. యిన్నాళ్ళూ నేను వున్నాను ఇకపై నిన్ను సోదరుడిని మించి కాళిదాసు ఆదరించినా నీలోటు యే ఒక్కరూ భర్తీ చేయలేరు. స్త్రీకి మగదక్షత లేనప్పుడు యెలా వుండేదీ ఆ పరిస్థితిని భయంకరంగా చిత్రించి చెప్పడం నా వల్ల కాదు. లతలాంటి స్త్రీకి ఆధారం మహావృక్షం. ఆలంబన లేని తీగ కాళ్ళక్రింద పడి నజ్జు, గుజ్జు అయిపోయినట్లే తోడులేని స్త్రీ జీవితం పతనం అయిపోతుంది.'

'నీకు యింకా ముప్ఫై దాటలేదు. స్టేట్స్‌కి వెడతానని యెందుకన్నావో నాకు తెలుసును. సాంబశివాన్ని కలుసుకోవాలని. అతను పెళ్ళికాకుండా యింకా నీ కోసమే పరితపిస్తున్నాడనే నమ్మకం యేమిటి? నువ్వు సాధించాలనుకున్నది అంత దూరం వెళ్ళినా రిక్తహస్తాలే మిగిలిన పక్షంలో నీ ప్రయత్నానికి అర్థం యేమిటి?'

'ఆడపిల్ల గడప దాటిందంటే మన సమాజం యెన్నో రకాలు అంటుంది. అటువంటిది నువ్వు అర్ధరాత్రి అతని దగ్గరకి వెళ్ళినందుకు నిన్ను రోగివని సమర్థిస్తుందంటావా? సాంబశివమే నమ్మడు. నామాట విను.'

'పిచ్చోడు బాబాయ్. నేను...నిరీక్షిస్తాను. పాపపుణ్యాల నిర్ణేత భగవంతుడు యిచ్చే తీర్పుని సంతోషంగా భరిస్తాను, నేను...' జయ ముఖంలో పిచ్చిదానిలా నవ్వి అన్నది...



'మరో పెళ్ళిచేసుకోవడం అది అసంభవం. సాంబశివానికి పెళ్ళి అయినా ఫరవాలేదు. నా నిరీక్షణ అతనికే కాదు, నేను చేసిన తప్పుకి శిక్ష అనుభవించేందుకు.'

రాఘవరావుగారు జాలిగా చూసి నెమ్మదిగా అన్నారు: 'యెలా బ్రతుకుతావో నిన్ను చూస్తే జాలేస్తున్నది. మోస భూయిష్టమైన యీ పాపిష్టి ప్రపంచంలో అమాయకులు తెగింపుగా బ్రతకలేరు. అడుగడుగునా విషనాగులు వీలు చూసి కాటు వేసేందుకు సిద్ధంగా వుంటాయి. నీ నిరీక్షణ ఫలించాలని మనస్ఫూర్తిగా చచ్చిపోయే ముందుకూడా భగవంతుడిని కోరుకుంటున్నాను. ఈ మేజ కాళిది. అతను యెన్నో కష్టనిష్ఠూరాలు భరించేడు. 'భారతీ!' ఆయన చేరపిలిచి భారతి శిరస్సుమీద చేయి వేసి 'నువ్వు దొడ్డయిల్లాలివి. జయని యెంత ఆదరణగా చూసేవు. నీకే నాపై ఆగ్రహం వచ్చివుంటే నా స్వార్థాన్ని వేయి విధాల యెత్తిచూపించి నన్ను దూషించేదానివి...

భారతి తెల్లబోయి చూసింది. కాళిదాసు ఆయనవైపు చూసి అన్నాడు: 'యిప్పుడెందుకు బాబుగారూ అవన్నీ. మీరు చేసిన వుపకారంలో యిదెంత?'

క్రమంగా ఆయనలో స్థిరత్వం తప్పిపోసాగింది. కన్న బిడ్డలవైపు చూస్తూ 'వాళ్ళు... ఆ కాళిదాసు మీకు అన్నలాంటివాడు. అతని పిల్లలు మీ పిల్లల్ని చేసుకోని పక్షంలో మీ కూతుళ్ళకే యీ ఆస్తి...', అన్నారు. యిక ఆపైన ఆయనగొంతు పెగల్లేదు. మిట్ట మధ్యాహ్నం యెండ నిప్పులు చెరుగుతోంది. సూర్యుడు నడినెత్తిమీద బాహాటంగా ప్రళయతాండవం చేస్తూ తన ప్రతాపం చూపిస్తున్నాడు. జగమంతా వ్యాపించిన ఆ వెలుగు రేఖలు ఆ యింటి పరిసరాలకి దూరంగా ఆగిపోయేయి.

డాక్టర్‌గారు అంతిమదశలో వున్నారని తెలిసి చుట్టుపక్కల పేరు ప్రఖ్యాతులు గడించిన డాక్టర్లూ, లాయర్లూ, యూనివర్శిటీ విద్యార్థులూ, స్నేహితులూ, ఆప్తులు, బంధువర్గం అంతా ఒక్కొక్కరిగా వచ్చి చూసి వెళుతున్నారు. కాళిదాసు పూర్తిగా సంస్కారంలేని తలవెంట్రుకలతో, మాసిన గడ్డంలో వచ్చే పోయే జనాన్ని

స్తితం గుర్తించలేని దిగంతాలలోకి చూస్తూండి పోయేడు. డాక్టరు గారికి యిదివరకు ఆడపిల్లలు యిద్దరే అనుకున్న వ్యక్తులు: 'ఆయనకి కొడుకూ, కోడలూ, మనవలూ, ముగ్గురు ఆడపిల్లలూ కూడా వున్నారు,' అనుకుంటున్నారు విరుసు మొహం పెడుతూ. సాయంత్రం పూర్తిగా కాకముందే ప్రకృతిని భయంకర చీకట్లు లాంటి మేఘాలు వ్యాపించి కటిక చీకటిలో ముంచేశాయి. నాలుగువైపులా వ్యాపించిన మేఘాల్లో యెక్కడా చలనంలేదు. తూరుపు దిక్కుగా నల్లటి కాటుక కొండలు పేరుకుని వికటాట్టహాసం చేస్తున్నాయి. అంత క్రితంవున్న వాతావరణం యిసుమంతకూడా కానరావడం లేదు. సూర్యాస్తమయం కావడం కంట పడలేదు. మేఘాలు విరిగి నెత్తిన పడ్డట్టు, వున్నట్టుండి పెను వర్షం, వురుముల ఫెళఫెళలతో ప్రకృతి భీకర రణరంగంగా మారిపోయింది. రాఘవ రావుగారి పంజరంలో చిలుక రెక్కలు టపటపలాడిస్తూ వినువీధుల్లోకి యెగిరి పోయింది. యింటిల్లిపాదీ ఘొల్లు మన్నారు. పరివారజనం వెంటరాగా క్రతువు పూర్తిచేసేందుకు కాళిదాసు అగ్ని హోత్రం చేత వుంచుకుని ప్రయాణం అయేడు స్మశానం వైపుగా. ఆయన జీవితంలో బాధ్యతల్ని విస్మరించకుండా తనకు తోచిన న్యాయాన్ని నలుగురికీ పంచి పెట్టి నిశ్చింతగా ఆవురావురుమంటూ కౌగలించుకునే సూర్యభగవానుడి కౌగిటిలో పరిసమాప్తి అయిపోయే నిమిత్తం అంకితమే అయిపోయేడు.

* * *

పదమూడు రోజులు కాళిదాసు యధేచ్ఛగా తోబుట్టువు లనబడే వారిద్దరి సలహా సంప్రదింపులూ తీసుకుని దాన ధర్మాలతోనూ, కర్మకాండతోనూ శాస్త్రోక్తంగా కర్మక్రియ పూర్తిచేసి 'శభాష్' అనిపించుకున్నాడు. భారతి వచ్చిన అతిథి అభ్యాగతులకి యే లోపమూ రానివ్వలేదు. తాతగారు పోయేక రఘురావ్, మోహన్‌లు ఆ గది ఛాయలవైపే పోయేరు కారు. జయ మెడచుట్టూ చేతులువేసి రఘురావ్

# పరిలిప్తం

కన్నీళ్లు కారుస్తూ అన్నాడు: 'పిన్నీ తాతగారు యెక్కడికి వెళ్లిపోయేరు', జయ నీరధిలోకి నిషాదంగా చూస్తూండి పోయింది. మోహన్ దూరంగా వచ్చి పోయే జనాన్ని ప్రశ్నార్ధకంగా చూస్తూండి పోయేడు. పసిపిల్లల అంతరంగంలో కుమిలిపు పెద్దవాళ్లకి అంతు చిక్కడంలేదు. ప్రొద్దు పోతే చాలు 'రఘూ, మోహన్' అని కేకవేసే ఆయన పిలుపు ప్రొద్దెక్కినా వినిపించడం లేదు. పది గంటల ప్రాంతంలో బూట్లు టకటకలలో పొన్నుకర్ర శబ్దంతో డైనింగ్ టేబిల్‌దగ్గర హాజరయ్యే ఆయన నిష్క్రమణ మహాభినిష్క్రమణే కాగా పిల్లలకది అంతు చిక్కని సమస్యగా తోచింది.

సాయంత్రం షికారు వెళ్లేందుకు సిద్ధంగా కారు హారన్ వినిపించకపోగా పైపెచ్చు మూల పడిపోయింది. కోవెల తలుపులు మూసుకుపోయినట్లు ఆ గది తలుపులు బిగించుకుపోగా కడుపులో చిత్రమైన బాధను యిద్దరూ మౌనంగా భరిస్తూండిపోయేరు. పదేళ్లప్రాయంనుండి దాటిన పిల్లలకి నిర్వచన విధానం తెలియక పోయినా వేదనా, కుమిలింపు ప్రదిగ్గుళ్ళడం అనేవి స్వతహాగా తెలుసును.

జీవన విధానంలో పోయినవారితోపోవడం, కష్టాలని భరించలేక చచ్చిపోయేందుకు ప్రయత్నం చేయడం, యివన్నీ వూహించినంత సులభ సాధ్యమయ్యే మార్గాలుగా తోచవు. కాకపోతే గుర్తుకు వచ్చినప్పుడు తనివితీరా యేడ్చేయడం అంతటితో తృప్తి పొంది లక్ష్యసిద్ధిపొందినవారిలా మౌనం వహించి నిశీధిలోకి దృక్కుల్ని విగడ్చడం మానవనైజం. ఆయన పోయినందుకు పెద్దవారు కనుకా, దయాత్ములూ, ధర్మ పరాయణులూ, పరోపకార ప్రస్తావన గల మహా మనీషులూ కనుక ఆయన్ని గురించి స్నేహితులూ, అప్పుతే బాధపడగాలేనిది కాళిదాసు కుటుంబం ప్రదిగ్గుళ్ళడంలో యేంతైనా అర్థం కావిస్తుంది. రోజులు కెరటాలవూదిరి వచ్చేసి మొదటిరోజును స్మృతిపథంలోంచి లాక్కుపోతూంటే తప్పని సరిగా కొంతవరకూ గుర్తుపెట్టుకోవడం పడదు. జీవితంతో రాజీపడకపోయేందుకు ఆయన వయసులోనూ లేరు, పైపెచ్చు హఠాన్మరణం కాదు. ఆయన పోయేక మరో నెల గడిచిపోయింది. ఎప్పుడెళ్లే శ్రీధరూ ప్రయాణం అయేందుకు సిద్ధం అయేరు. పెద్దావిడ రాజ్యలక్ష్మి కాళిదాసుని చేరబిలిచి ప్రయాణం సంగతి చెప్పివేసింది. కాళిదాసు ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో యిద్దరివైపు చూస్తూండగా అతని భుజంపైన చేతిని వేసి ప్రేమగా అన్నది ఆవిడ: 'నాన్నగారి సూత్రాలని నమ్మినవాళ్లం మేము పిల్లల విషయంలో నాకు అభ్యంతరాలు లేవు. నువ్వు తమ్ముడివని అంటున్నారు. మేము పూర్తిగా విశ్వసిస్తున్నాం. అప్పుడప్పుడు మా దగ్గరికి రావడం బాధ్యత అనుకోకు. అంతేచాలు' ఆవిడ కళ్లు తడిశాయా క్షణంలో.

కాళిదాసు చెప్పవేయకుండా ఆవిడవైపు చూశాడు. నలభైయేళ్లు దాటిపోయిన ఆవిడ గుండెలకి తలకి అన్చి 'అలాగే అక్కయ్యా' అన్నాడు.

శ్రీలత అదేమాట అన్నది.

భారతి గుమ్మంవరకూ వచ్చి 'మీరు మరోలా అనుకోవద్దు. పిల్లల్ని యిక్కడే వుంచి వెడితే యెందుకైనా మంచిదనిపిస్తోంది. చిన్నప్పటి ఆత్మీయతని మనం వివాహబంధంతో స్థిరపరచవచ్చని తోస్తోంది. వాళ్ళూ కలిసిపోయేరు' అన్నది.

వ్యర్థంగా నవ్వింది రాజ్యలక్ష్మి: 'గీతలో వుండాలే కానీ మనం చేసే ప్రయత్నాలు అన్నివేళలా ఫలిస్తాయని తోచదు.'

ఆ సాయంత్రమే వెళ్లిపోయేరు రాజ్యలక్ష్మీ, శ్రీలతా పిల్లలూ.

(ఇంకావుంది)




ఈలోకంలో సమస్తమూ చక్రంపైనే ఆధారపడి వుంది. చక్రం లేకపోతే బళ్ళు నడవవు యంత్రాలు పని చెయ్యవు. వ్యవసాయం సాగదు. పంటలు లేవు. పరిశ్రమలు లేవు అందువల్ల చక్రం సక్రమంగా తిరుగుతూ వుంటేనే అన్ని పనులూ సక్రమంగా జరుగుతూ ఉంటాయి.

ధర్మం సక్రమంగా ప్రవర్తిస్తూ వుంటే లోక వ్యవహారాలు ఎలాటి చిక్కులూ లేకుండా జరుగుతూ వుంటాయి. అందువల్లనే ధర్మమనేది చక్రరూపం అని చెప్పబడింది.

భగవంతుడు చక్రాయుధాన్ని ధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్నాడంటే ధర్మాన్ని చేతిలో వుంచుకుని లోకాలను కాపాడుతున్నాడని అభిప్రాయం. భగవానుడే గీతలో-ధర్మం క్షీణించే సమయంలో తాను అవతరించి లోకాన్ని ఉద్ధరిస్తానని

"యదా యదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్."

అని చెప్పివున్నాడు ఎప్పుడెప్పుడయితే ధర్మానికి క్షీణదశ, అధర్మానికి అభ్యున్నతి కలుగుతాయో, అప్పుడు నేను అవతరించి, అధర్మాన్ని నశింపజేసి, ధర్మాన్ని నిలుపుతానని దీని అభిప్రాయం!

ధర్మమనేది చక్రమై ప్రవర్తిస్తూ వున్నప్పుడు దాని ప్రవర్తనను ఆటంకపరిచేదే అధర్మం అని తెలుసుకోవాలి! చక్రం సక్రమంగా తిరుగుతూ వున్నప్పుడు దాని మధ్య ఏదయినా పుల్లగాని, మరేదయినాగాని పడినట్లయితే, ఆ చక్రం గమనంతో అంతరాయం కలిగి అది నట్టుతుంది. దానివేగం తగ్గిపోతుంది. దానికి పెద్ద బండరాయిగాని, అటువంటిది మరి ఏదయినాగాని అడ్డు వచ్చినట్లయితే ఆ చక్రం నిలిచిపోతుంది కదా! ఈ విధంగానే ధర్మం సక్రమంగా సాగుతూ పోతున్నప్పుడు, అధర్మం దానికి అడ్డు తగిలితే ధర్మానికి అంతరాయం కలుగుతుంది. అందువల్ల అధర్మం విజృంభించడమూ, అకార్యాలు చోటుచేసుకోవడమూ, ప్రతికూల శక్తులు విజృంభించడమూ జరుగుతుంది. మానవుని పురోభివృద్ధి ఆగిపోతుంది. అతడు ఎంత ప్రయత్నించినా ప్రయోజనం వుండదు. అతడు నిస్సహాయస్థితిలో ఉంటాడు. ఇంతే కాకుండా చక్రం పళ్ళు విరిగిపోవడం, మరోరీతి మరమ్మత్తు అవసరం కావడం సంభవించవచ్చును. అప్పుడు దానిని సరిచెయ్యడానికి తగినవ్యక్తి రావాలి; యంత్రాలను గురించి తెలిసిన ఇంజనీరు రావాలి. ఆవిధంగానే ధర్మాన్ని సరియైన స్థితిలో ప్రవర్తింపజెయ్యడానికీ, అధర్మాన్ని అణచివెయ్యడానికీ భగవంతుడు ఏదో ఒకరూపంలో అవతరిస్తూ వుంటాడు.

అధర్మాన్ని పోగొట్టి ధర్మాన్ని నిలిపి, తమ్ము కాపాడాలని ప్రజలు కోరకపోయినా, ఆర్తత్రాణ పరాయణుడైన భగవంతుడు సాధుపరిత్రాణం కోసమూ దుర్మార్గులను నశింపజెయ్యడం కోసం అవతరిస్తూ వుంటాడు. ధర్మాసక్తులూ, పాపభీతి కలవారూ అయిన ప్రజలు భగవంతుణ్ణి ప్రార్థిస్తూనే వుంటారు.

ధర్మచక్రాన్ని ప్రవర్తించడం కోసం సర్వార్థ సిద్ధుడు బుద్ధ భగవానుడై జన్మ, జరామరణ దుఃఖాపాయములనుంచి ప్రజలనుపరిరక్షించడం కోసమూ, వారికి నిర్వాణాన్ని కలిగించడం కోసమూ, తగిన ఉపాయం అన్వేషించి ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేశాడని అందరికీ తెలుసును. భారత ప్రభుత్వానికి చిహ్నమైన అశోకచక్రమే ధర్మచక్రానికి ప్రతీక.



చలిగా వుంది.

ప్లాటుఫారమ్మీద లైట్లు వెలక్కుండా వుంటే అక్కడ చీకటిగానూ వుండేది. సైజులో అది చిన్నస్టేషన్ అయినా, అక్కడా ప్లాట్‌ఫారమ్మీద పెద్దలు కొందరు చేతులూపుకుంటూ, మధ్యమధ్య ఛలోక్తులు విసురుతూ మాట్లాడుకోవడంవల్ల — అది పలుకుబడీ రద్దీ వున్న స్టేషనేమోనన్న భ్రాంతి కలుగుతుంది...

పెద్దలకి కొంచెం దూరంలో కంబళీ కప్పుకుని ఒక బల్లమీద వొదిగి వొదిగి కూర్చున్నాడు సత్యం. అతన్నెవరూ పట్టించుకోడంలేదుగానీ, అతను మాత్రం అందర్నీ గుచ్చిగుచ్చి చూస్తున్నాడు. అతను అనారోగ్యంచేత పీడింపబడుతూన్న రోగి. ఎంత కంబళీ కప్పుకూర్చున్నా వొణికి పోతున్నాడు. జ్వరతీవ్రతవల్ల వొణికిపోవడమేకాకుండా, బసవపున్నయ్యగార్ని చూస్తూ కూడా వొణికిపోతున్నాడతను.

అతనూ, ఆ పెద్దలూ ఎదురు చూస్తున్న రైలు మరో అరగంటకిగాని చేరదుట.

ఆరడుగుల ఎత్తూ, తగ్గ శరీరమూ వున్న మనుషులంతా ఒక్కలా బతుకుతారంటే ఒప్పుకోకూడదు. బసవపున్నయ్య గారు పాతికేళ్లక్రింద బసివిగాడనే పిలవబడేవారు. ఆ బసివిగాడికి పాతికేళ్లక్రితం ఒకానొకరోజు కలిసిరావడంలో బసవ పున్నయ్యగారైపోయేరు. మామూలైన జనం బసివిగాడి 'సిరి'కి ఈసు చెందుతున్నారే తప్పించి, ఈసిరి వెనక బసివిగాడి కృషని అభినందించరే ఖర్మ!

దేవుడిచ్చిన తెలివికి స్వయంకృషిలో మెరుగుపెట్టి, ఆ మెరిసే తెలివిని సకాలంలో వాడుకోడం అందరికీ చాతవుతుందా? అందరికీ అందుబాటులో వుండని అద్భుతశక్తులు కొన్ని కొందరికి మాత్రమే సొంతమవడం వాళ్లుచేసుకున్న అదృష్టం కాదూ...ఎక్కడో, ఊరికి దూరంగా గొడ్ల చావిటిలాటి పూరిగుడిసెలో జన్మించిన బసివిగాడు, ఇవాళ మేడలోవుండి కారుల్లో తిరుగుతున్నాడంటే, అతనుపొశిస్తున్న అద్భుత శక్తులే కారణం కావూ...వారాల పద్దుల్లో, వీధి దీపాల నీడల్లో బసివి చదువుకోలేదు. అమ్మా ఆకలి, బాబూ ధర్మమని బసివి ఏనాడూ నోరుతెరిచి ఎవర్నీ అడగనూ లేదు. ఎటో ఒక పక్కనుంచి అకస్మాత్తుగా లాభంలాటి దేవీ బసివిని అలంకరించనూ లేదు.

అటులైన బసివెట్లు బలిసెను?

తెల్లదొర నల్లవాడ్ని పాలించే రోజుల్లో బసివి కేవలం నల్లవాడు: తెల్లదొరని పొమ్మనే గోలలో బసివికి మూలసూత్రం అర్థం గాకపోయినా, అదీ ఒకరకమైన ఉద్యోగంకింద జమకట్టుకుని; తోటి నల్లవాడు అన్యాయం చేయలేడని తెలుసుకుని అతనూ గోల చేసేడు. తెల్లవాడు వెళ్లిపోయేరోజు దగ్గిరపడ్డది. రాబోయే నల్ల రాజ్యంలో కాబోయే నల్లదొరయ్యేందుకతను కొన్ని మార్గాలు అనుసరించేడు. ప్రత్యేకించి జైళ్లకెళ్లేడు. కావాలని లాఠీదెబ్బలు తిన్నాడు. నల్లవాడికి రాజ్యమొచ్చే వేళకి బసివి చిన్నసైజు కుర్చీ వెదుక్కున్నాడు. ఆ తర్వాత అతనో సిద్ధాంతాన్ని గమనించేడు. నాలుగు రాళ్లున్న మనిషిని చూచి రాళ్లులేని మనిషికిమంట. ఈ మనిషి ఆ మనిషినీ, ఆ మనిషి ఈ మనిషినీ దూరంగా వుంచడం రూలు. ఈ రూలుని అతి జాగ్రత్తగా పరిశీలించి తన బాగుకోసం కొన్ని గొర్రెల్ని ఎంచుకున్నాడు బసివి. ఒకదాని కొకటి కలిపి కొన్నాళ్లూ, భాగించి కొన్నాళ్లూ గుణించి కొన్నాళ్లూ కొన్నిలెక్కలు తయారు చేసుకున్నాడు ... ఒక శుభోదయాన అటు రాళ్లున్న మనిషికీ, ఇటు రాళ్లులేని మనిషికీ అందకుండా ఎదిగిపోయేడు.

అలా ఎదిగిపోయిన కొంతకాలం అతను అల్లరిపాలైనా, ఎత్తుమనుషుల జాబితాలో చేరిపోవడం వలన ఆ అల్లరి గౌరవాభిమానం కింద మారిపోయి పరిస్థితులన్నీ చక్కబడ్డాయి.

బసివి దశలో 'చదువు'కోక పోవడం సమంజస మనుకుంటే, బసవపున్నయ్యగారు అసాధ్యులు గనక సంతకం తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ చేయడంవరకూ నేర్చుకుని చదువు నక్కడితో విడిచిపెట్టేసేరు. సంతకానికి విలువ పెరిగిందనే ప్రమాదాన్ని గమనించేరు గనకనే ఆ మాత్రం కష్టపడ్డారు. లేకుంటే ఆ కష్టానికి మారుగా వారు మరికొన్ని చిలక పలుకులు నేర్చుకుని వుండేవారేను. ఇవాళ వారు 'అయినా బావ సమ్మంధం' (అవినాభావ సంబంధం) లాటి విలువైన ముక్కల్ని ఎప్పుడెలా ఎక్కడ నొక్కి ఉపయోగించాలో తెలిసిన వారయ్యారంటె రాయడమెలాగో వొదిలేయడం వల్లనేగా.

వారికిప్పుడు తమ సింహాసనంతో పాటు రెండు మిల్లులూ, లక్షలపైబడి ఆదాయమొస్తున్న కాంట్రాక్టులు, వాటి హోదాలో పలుకుబడి, అప్పుడప్పుడూ దేశ్సేవ, ఆలోచించి దానధర్మాలు, క్లబ్బులూ గుర్రాలూ, మందులూ చీట్లపేకలూ— అమాంబాపతు కార్యక్రమాల్లో ఊపిరాడటం లేదనే వదంతు నూటికి నూరుపాళ్ల నిజం.

ఇంత పత్తిడిమనిషి బసవ పున్నయ్యగారు తనకటాయిటూ మెరిసే మనుషులతోపాటు ఆ స్టేషన్లో నించుని వుండటం, ఆ స్టేషను చేసుకున్న పుణ్యంకాదూ.

'ఏంటోయ్ పంతులూ, ఏంటన్నాడు?' అన్నారాయన తనకెదురుగా వొస్తున్న మనిషిని గుచ్చి చూస్తూ...

'ఏమి లేటు లేదుటండి!' అన్నాడు పంతులు దీర్ఘాలు తీస్తూ.

'అల్లుడ్ని' లేకితనం రాపోతే రైల్లో

రాలుమంటి?' ప్రేమగా విసుక్కున్నారు బసవ పున్నయ్య.

'అమ్మమ్మ' తవఁరామాటన కూడదు. కూడబెట్టేది దుబారా కొరకుటండీ! ముందుచూపు లేకపోతే ఎల్లా? పైగా ఆడపిల్లా తండ్రాయె...' అన్నాడు పంతులు.

'ఇదుగో పంతులూ ... పేదరపులు అరవమాకు. ఇట్టా కర్సులకెనకాడే మిల్లులు కొన్నామా?' మళ్లీ ప్రేమగావే విసుక్కున్నారు శ్రీవారు.

పంతులు వాళ్లు ఊండిపోయి గురిచూచి బాణం వొదిలేడు—

'తవఁరి గురించి చెప్పకండి మరి. తవఁరికాలం అల్లా నడిచిందంటె అది ఉత్త పుణ్యకాలం. ఇప్పటి రోజాలెంత ప్రమాదంగా అఘోరిస్తున్నాయో వేను చెప్పాలా?'

—వాళ్లకి దూరంగా కూచుని వింటూన్న సత్యానికి, పంతులు నుడివిన బసవ పున్నయ్యగారి పుణ్యకాలమీ్మదికే మనునసు పోయింది...

'నేనీ సంవత్సరమైనా చదువుకోవాలి నాన్నా! నేనీపొలం పనులకి పనికిరాను. నన్నొదులు. నేను చదువుకుంటాను. నాతోటి వాళ్లంతా డిగ్రీలు పుచ్చుకోబోతూంటే నన్నిక్కడ కట్టిపారేస్తే న్యాయంకాదు' అన్నాడు సత్యం కొన్నేళ్ల క్రితం.

చేతకాని నారాయణ కొడుకునిరుత్సాహన్ని ఓపిగ్గానే విన్నాడు. కొడుకుని కాలేజీకి పంపే స్తోమతు తనదగ్గర లేదంటే లేదనే నిజం నారాయణకి బాగా తెలిసుండటంవల్ల—చేతులారా కొడుకు భవిష్యత్తుని పాడుచేస్తున్నానేమోనన్న బెంగ అతన్ని కృంగదీసింది.

కొడుకు విషయంలో బసవపున్నయ్యగారి సలహా అడిగి తెలుసుకోడం తక్షణ కర్తవ్యం అనుకున్నాడు.

అందుచేత కొడుక్కి చెప్పవలసిన సమాధానం వాయిదావేసి బస్తీకి వచ్చేడు.

సొంతభవనంలో సభ తీర్చివున్న బసవ పున్నయ్యగారు నారాయణని వెంటనే పరామర్శించలేకపోయేరు. భోజనాలవేళ మించిపోతుందని 'ఎవరో హెచ్చరించగా సభ చాలించిన శుభసమయంలో నారాయణకి బసవపున్నయ్యగారి దర్శనభాగ్యం కలిగింది.

వారిముందు చేతులు రెండూ జోడించి నిలబడ్డాడు నారాయణ.

'యెంతసేపయిందేంటి?' అన్నారాయన.

ఉదయమే వచ్చాను. వీధిలోకూర్చున్నాను'

'ఏంటి విషయం. అర్జంటా?'

'కుర్రాడు యసల్సిపాసై మూడుసంవత్సరాలైపోయింది. ఉద్యోగం వేయిస్తారనే



ఆశతో కూచున్నాను. వాడేమొ పొలంపనులు చేయలేనంటున్నాడట. ఇంకా చదువుతానంటున్నాడు. మీమాటేమిటో విని వెడదామని వచ్చేను.'

'అదేంటయ్యా...ఉద్యోగమంటే మాటలా? పోనీ...మిల్లులో లెక్కలు రాస్తాడేమొ కనుక్కున్నావా?'

'ఇంకా చదువుతాననంటున్నాడు'

'సమాతాడా? నారాయణా నేనోటిజెపుతాను యిను. ఆడొక్కడే కాదుగా నీ కొడుకు. గంపెడున్నారు నీకు. ఆడొక్కడ్ని సదివించి మిగతా వోళ్లనేంజేత్తావ్? కాలేజీ సదువంటే మాటలోపనా? మా సొరాజ్యం సదూ నన్ను తినేస్తుండాది తెలుసా? అందరి నోళ్లా కట్టేసి నువ్వాడ్ని సదివించేవనుకో...ఆడు సదివేంజేయాలి? నౌకరేగా...పందరూపాయల నౌకరేదో జేత్తాడంతేగా. నాపొలం జేత్తున్నందుకు ఆ డబ్బు యిప్పుడు ముట్టటంలేదా? ఏంటి! నేనంటుంవాలకిస్తుండావా?'

నారాయణకి వారి ఉపదేశం నచ్చినట్టే

వుంది. అయితే, ఇది విని కొడుకేడుస్తా డేమోనన్న బెంగమాత్రం దూరంగా లేదు. అందుచేత, అతనక్కడున్నంచింకా కదం లేదు.

బసవపున్నయ్యగారు అసాధ్యులు గనక వారేం అనుకున్నదీ వెంటనే చెప్పడం సులువుకాదు. ఏదో ఆలోచించి తల గాల్లో నూపి అన్నారు.

'సర్లే. నీ మాటె కానిద్దాం. కుర్రోడ్ని మాయింటికి పంపు. నాకింత సేత్తున్నావ్. నీ ఉసురు నా నాకెందుకు? కుర్రోడి పంతమే నెగ్గిద్దాం. ఆడ్ని సదివిస్తాను. సరేనా? కర్చులంటావా? అయ్యెక్కడికి పోతాయ్. లెక్కరాసుకుందాం. ఏంటంటావ్?'

నారాయణ కళ్లల్లో ఆనందం వెలగడమే గాకుండా, గొంతులో కృతజ్ఞత నిండి మాటాడనివ్వలేదు. ఏదో చెప్పబోయి విఫలుడైనట్టు పసిగట్టిన బసవపున్నయ్య ఫెళఫెళా నవ్వేసి, భుజాలెగురవేస్తూ అన్నాడు.

'అర్రే పిచ్చిముండకొడుకంట! ఏం టయ్యా పూనకం. నాకుమాత్రం మనసు లేదంటయ్యా. నువ్వొకటీ, నేనొకటా? ఇదంతా యలషన్లొత్తనుకుంటుండవల్లె వుంది. యలషన్లు యలషన్లే, మనం మనమే అట్టాకళ్లెగరేయమాకు. ముందు కుర్రోడ్ని పంపు.'

నారాయణ మరేమీ మాటాడలేక మళ్లా చేతులు రెండూ జోడించి వెళ్లిపోయేడు.

ఆ ఏర్పాటువల్లనే సత్యం బసవపున్నయ్య గారింటికి వచ్చేడు. అప్పటికి వేసవి సెలవ లింకా పూర్తి కాలేదు. ఆ సెలవులు పూర్తయింతర్వాత అతను కాలేజీ కుర్రాడవబోతున్నాడనే ఊహ అతన్ని మురిపించేది. బసవపున్నయ్యగారిపట్ల అతనికి మునుపటి గౌరవం రెట్టింపవడమేగాకుండా, ఆయింటి జనాభాపట్ల అతనికి కృతజ్ఞతాభావం పెల్లుబికింది.

ఇన్నేళ్లూ, దూరంగా ఎక్కడో పల్లెటూళ్లో, పొలం పనుల్లో నలిగిపోయిన అతని శరీరమూ, మనసూ—బస్తీలో బసవపున్నయ్యగారి భవంతిలో సేదతీర్చుకున్నాయి.

ఆయింటి వాతావరణం మాత్రం అతనికి వింతగా వుండేది.

ఆ యింట్లో బసవపున్నయ్యగారిహోదాని, వారి అర్ధాంగి చక్కగా కాపాడుకునేది.

# శరశ్చంద్రిక

ఆవిడ అనుమానం మెరుస్తూనే కనుపించేది. భర్తతోపాటు ఆవిడెన్నెన్నో గొప్ప కార్యక్రమాల్లో పాల్గొనేది.

వాళ్ల ఏకైక పుత్రికా రత్నం పేరు స్వరాజ్యం. ఆపిల్ల, ఈదేశానికి స్వరాజ్యం వొచ్చిన్నాడే పుట్టిందని బసవపున్నయ్యగారనేవారు. ముద్దుగా 'సొరాజ్యం' అని పిలుస్తుండేవారు.

స్వరాజ్యం నిమ్మపండు ఛాయలో పచ్చగావుండి, గాలి కొట్టిన బంతిలా పుబ్బివుండి, కొని తెచ్చుకున్న కొన్ని అలంకారాలతో ఖరీదైన మేలుజాతి కుక్కపిల్లలా వుండేది. కాలేజీలో కొందరు మగపిల్లలు ఆ అమ్మాయిని 'కుక్కపిల్లా' అని ముద్దుగా పిలుచుకునే విషయం సత్యం విన్నాడు.

ఆ అమ్మాయి కాలేజీలో బి. ఎ. మొదటేడు చదువుతోందప్పుడు. వేసవి సెలవలు మూలంగా ఆ పిల్లయింటి పట్టునే కూర్చునేది. అందమైన సాయంత్రం కోసం ఆశగా ఎదురు చూస్తూండేది. ప్రతి సాయంత్రం ఆ అమ్మాయి క్లాసు ఆడపిల్లలు కొందరొచ్చేవారు వాళ్లంతా మేడమీద కూచుని వాళ్ల క్లాసు మగపిల్లల గురించి మాటాడుకునేవారు

ఇంటికి వచ్చిన ఆడపిల్లలు స్వరాజ్యం హొందాని, హోదాని తెగపొగిడేవారు. స్వరాజ్యం యిచ్చే అందమైన కాఫీలు తాగి, చీకటి పడేంతవరకూ మేడమీద బుల్లి బుల్లి ముచ్చట్లాడి, చీకటిపడ్డ తర్వాత ఎవరిళ్లకి వాళ్లు వెళ్లేవారు. వెళ్లిపోయే ముందు తరచూ వాళ్లను కునే దిగులుమాట—

'ఈ సెలవలెప్పుడైపోతాయో గానీ బోరుకొట్టి ఛస్తున్నామోయ్!'

స్వరాజ్యం వాళ్లు మాటాడుకునే సమయంలో సత్యం గూడా వాళ్లమధ్య చేరడం కద్దు. సత్యానికి వాళ్ల ముచ్చట్లు చిరాగ్గా వున్నా, అలనాడెప్పుడో స్వరాజ్యం అతన్ని ఆ ఆడపిల్లలకి పరిచయం చేయడంవల్ల—ఆ పరిచయాన్ని పురస్కరించుకుని చిన్న చిన్న అవసరాలు వాళ్లకి చూడటం పరిపాటై పోయిందతనికి,

ఆడపిల్లలు మేడమీద చేరి ముచ్చట్లాడుకునేవేళ వాళ్లకి స్నేహ పూర్వకంగా కాఫీ లందించడంలోనూ, వాళ్లంతా కొత్త ఇంగ్లీషు హిందీ సినీమాలకు వెళ్లేరోజున సదరు థియేటరుకు వెళ్లి టిక్కట్లు (స్నేహ పూర్వకంగానే) రిజర్వు చేయించుకోడంలోనూ సత్యం ఉపయోగింపబడేవాడు.

ఒక పక్క...

శ్రీవారూ, శ్రీమతీ కలిసి క్లబ్బులూ, డిన్నర్లూ వగైరాలకు హాజరయ్యేవారు, పెద్దవాళ్లతో కలిసి స్వరాజ్యం ఎక్కడికీ వెళ్లేది కాదు: అలా వాళ్లతో కలిసి వెళ్లడంలో సుఖం లేదనే నిజం ఆపిల్ల ఎన్నడో గ్రహించే వుంటుంది. పెద్దవాళ్లెప్పుడూ పెద్దసైజు ముచ్చట్లే చేస్తారనే రూలుని ఆపిల్ల అనుభవపూర్వకంగా తెలుసుకుని వుంటుంది. వాళ్లమధ్య చిన్నసైజు కాలక్షేపం జరగదుగాక జరగదు. అక్కడ కాలేజీలో చదివే మగపిల్లల ముచ్చట్లు రానేరావు.

అందుచేత స్వరాజ్యం తనకోసం తన మేడమీద చిన్నసైజు కాలక్షేపం ఏర్పాటు చేసుకునేది.

ఒకనాడు—

వచ్చిన ఆడపిల్లలంతా వెళ్లిపోయిం తర్వాత స్వరాజ్యం ఒక్కర్తీ మేడమీద వుండిపోయింది. చాలాసేపు అక్కడేపచార్లు చేసి సత్యాన్ని పిలిచింది—సత్యం వెళ్లేడు.

'ఒక చిన్నసాయం చేయగలవా సత్యం?'

'చెప్పండి.'

స్వరాజ్యం చాలా సమయాల్లో వాళ్ల నాన్నలాగా మాటాడగలదు.

'రాణి ఇవాళ సాయంత్రం రాలేదు. నాకో పుస్తకం తెస్తానని నిన్న చెప్పింది. మరెందుచేతనో ఇవాళ రాలేదు రాణి'

తిన్నగా మాటాడవేం సత్యానికి తెలుసు.

'నన్ను వాళ్లింటికి వెళ్లి రమ్మంటారా?'

'చాలా మంచివాలని నిన్న చెప్పింది. తప్పనిసరిగా ఇవాళ చదవాలనుకుంటున్నాను.'

'అయితే ఇప్పుడే వెడతాను'

'పదినిమిషాల్లో వచ్చేస్తావుగా. నీ కోసం ఎదురు చూస్తుంటాను.'

'అలాగే.'

15
సార్లు
లండనుకు

LONDON

మరియు 7 సార్లు న్యూయార్కుకు

AI-858Rev




50 సంవత్సరాల
ప్రపంచ వైమానిక
సహకారం.

# ఎయిర్-ఇండియా

బి. ఓ. ఎ. సి. మరియు క్వాంటాస్‌వారి సౌజన్యంతో

## శరశ్చంద్రిక

'సత్యం రాణి వాళ్ళింటికి వెళ్ళేడు.

రాణి అనబడే ఆ యువరాణి స్వరాజ్యం వాళ్ళ క్లాసుమేటు. పెద్ద కుటుంబంలో పుట్టి అల్లారుముద్దుగా—సరిగ్గా స్వరాజ్యంలాగా — పెరుగుతోంది. ఆటు, రాణి తల్లితండ్రులు బసవపున్నయ్య దంపతులకేమీ తీసిపోరు. కాకపోతే, హోదాఅందు కోడంలో కొంచెం తేడా వుండనే వుంది. బసవపున్నయ్యగారు స్వశక్తితో హోదా నందుకుంటే, ఇవాళ రాణితండ్రి రాణి తల్లిని పెళ్ళిచేసుకోడం మూలంగా హోదాకి చేరుకున్నాడు.

రాణి తల్లికిది రెండో పెళ్ళి. ఆ తల్లి ధనవంతురింట్లో పుట్టి పెరిగింది. ఆ తల్లికి పెళ్ళయిన మూడోనాడే మొగుడు భూమ్మీద నూకలు చాలించుకున్నాడు. ఆ దరిమిలా రాణితల్లి చాలాకాలం వైధవ్యం భరించింది. ఎన్నాళ్ళు భరించ గలదు? ఒకటి, రెండు సంవత్సరాలు భరించి మూడోసంవత్సరం రాణితండ్రిని కట్టుకుంది. ఆ మానవుడు ఆశతో బతికే వాడు గనుక, కోరి మరీ రాణితల్లిని పెళ్ళి చేసుకుని 'ఆదర్శ వివాహమ'ని బోర్డు కట్టు కున్నాడు. బోర్డులో వున్న ఆదర్శం ఆ దంపతుల మనస్సుల్లో వుండేది కాదు. ఆసరం కొద్దీ ఆమె, ఆశకొద్దీ అతను పెళ్ళి చేసుకున్నారే తప్పించి ఒకర్నొకరు ఉద్ధరించాలనే పవిత్రాశయంతో కానే కాదు గదా! అందుచేత వాళ్ళ బతుకు నటించడంతోనే సరిపోతుంది.

సత్యం వెళ్ళేసరికి ఆ ఇల్లు నిశ్శబ్దంగా వుంది. ఇంట్లో ఎవ్వరూ కనిపించరు. రాములు గూడా లేనట్టు కనిపించ డంతో అతను వెనుదిరిగి రాబోయేడు. అప్పుడతను అందమైన స్కూటర్ని చూడ టంతో అక్కడ ఆగిపోయేడు.

ఆ స్కూటరు గోపీగారిది. గోపీగారిని స్వరాజ్యం అండ్ కంపెనీ అమ్మాయిలు 'గోపీబాబు' అంటారు. గోపీబాబు అవ తారంగారబ్బాయి. అవతారంగారు పట్నం ప్రముఖుల్లో ఒకరు. గోపీబాబుకి చదువు వంటక, చదువుమీద మోహమున్నా తండ్రిచేసే వ్యాపారంలో దిగిపోయి సుఖి స్తున్నాడు.

లోపలి గదిలోంచి గోపీబాబు నవ్వు విని పించింది. ఆ వెనక రాణి 'ప్రామిస్ చెయ్యండి' అనడంతో, అతనేం చేసేడోగాని ఈతడవ ఇద్దరి (జాయింటు) నవ్వులూ విని పించగా — వాళ్ళని చూడాలనే మానవ సహజమైన పాడుకోరికతో సత్యం కిటికీ దగ్గర నించుని వాళ్ళని చూసి — కళ్ళు రెండు గట్టిగా మూసుకుని వొచ్చేసేడు.

కాసేపటికి గోపీబాబు బయట కొచ్చేడు. సత్యాన్ని చూసి — చూడటంతో ఖంగారుపడి అడిగేడు.

'ఎంతసేపయిందోయి సత్యం, నువ్వొచ్చి?'

'ఇప్పుడే వచ్చేను.'

'ఆలాగా...ఏం కావాలిట?'

'రాణిగారు స్వరాజ్యంగారికి పుస్తకమిస్తా నన్నారుట. తీసుకుపోదామని వచ్చేను.'

'రాణి లోపలుంది. వెళ్ళు.' అని, గోపీ బాబు స్కూటరు స్టార్టుచేసి వెళ్ళి పోయేడు.

సత్యం పిలవకుండానే రాణి బయట కొచ్చింది పుస్తకంతో. ఆ పిల్లమొహాన్ని ఆవరించిన ఖంగారును స్పష్టంగా చూడ గలిగేడు సత్యం.

'నేనే పంపుదామనుకున్నాను సమయానికి రాములు లేకపోయేడు వెధవ. ఇదిగో పుస్తకం' రాణి పుస్తకం సత్యానికిచ్చి వేగంగా యింట్లోకి వెళ్ళిపోయింది.

సత్యం పుస్తకం పుచ్చుకుని వొచ్చేసేడు.

ఆ ఇంటి ప్రాంతాల్లోనే రాములు సత్యానికి కనిపించేడు. వాడు చాలా అస హ్యంగా నవ్వేసి అడిగేడు...

'ఏం గురుగారో...రాణమ్మగారినుంచేనా? గురిచూసి సమయానికి వెళ్ళేరు...అక్కడేం చూసేరేంటి?'

సత్యం నవ్వుతూ అన్నాడు.

'పుస్తకంకోసం వెళ్ళేను. తీసుకువస్తున్నాను.'

'అంతేనా? గోపీబాబు కనపళ్ళే? వారబ్బ వచ్చేరో లేదో మనమిటొచ్చేసేం. ఇద్దరి దగ్గర్నుంచి కాఫీకి డబ్బులు గిట్టే యనుకోండి, ఇది మామూలేగా. పెద్దమ్మా పెద్దయ్యా ఇంట్లోలేరు. వారిద్దరూ అవ తారంగారింటికెళ్ళేరు. అందుచేత గోపీ బాబు యిక్కడికొచ్చేడు. అవతారంగారు యిక్కడికొస్తే రాణిగారు గోపీబాబుని కలుసుకోడానికి అక్కడికి వెడుతుంది. ఏమిటో గొప్ప బతుకులెండి. తమకెట్టుంది?'

'ఏమిటి?'

'ఏం చెప్పన్లెండి విచిత్రాలు. వెళ్ళి రండి. మరో తడవ మాట్లాడుకుందాం. వెళ్ళండి.'

సత్యానికి గోలంతా అసహ్యంగా వుంది. కొంచెం వేగంగా ఇంటికివెళ్ళేడు.

స్వరాజ్యానికి రాణి— గారి కబుర్లు బాగా తెలుసును. రాణి వాళ్ళింటి నుంచి బసవపున్నయ్యగారింటికి రావడానికి రానూపోనూ పది, పదిహేను నిమిషాలు మించదు. ఆనాడు సత్యం గంటకి గాని పుస్తకం తీసుకు రాలేదు. చదవాలనుకున్న మంచి పుస్తకం అంత ఆలస్యంగా చేతి కందడంతో స్వరాజ్యం చాలా విసుక్కుంది. కటువుగానే అన్నది.

'ఏం మనిషివి సత్యం! నీకో పని చెప్పినా అంతే. ఇష్టం లేకపోతే ఇష్టం లేదని చెప్పాలిగాని ఓ పుస్తకం తెచ్చి యిచ్చేటందుకు గంటసేపు నేను వెయిట్ చేయాలా?'

'వెళ్ళగానే పుస్తకమిస్తే నేను పావు గంటలోనే వచ్చేవాడిని.'

'మరి. పుస్తకం యివ్వకుండా ఏదో ఖబుర్లాడిందా రాణి?'

'నాతోకాదు గోపీబాబుతో' అన్నాడు సత్యం కొంచెం కోపంగా.

గోపీబాబు పేరు విని వినడంతో స్వరాజ్యం చల్లబడింది. ఆతర్వాత ఆపిల్ల ఎంతో ఉత్సాహంగా అడిగింది.

'గోపీబాబా? అతనక్కడే వున్నాడా? ఇంకా ఎవరెవరున్నారు? అక్కడే నువ్వేం చూసేవ్ సత్యం?'

సత్యం స్వరాజ్యం వేపు అసహనంగా చూసి, తల దించుకుని అన్నాడు.

'అవన్నీ నన్నడక్కండి. రేపు రాణిగా రొస్తే స్వయంగా ఆవిడ్నే అడగండి. మరోటి...ఇక ముందు నన్ను ఆయింటికి పంపకండి. అంతే!'

సత్యం జవాబు విని స్వరాజ్యం ఆశ్చర్యపోయింది. మనసులో ఏమను కుందో ఏమోగాని, మరేమీ మాట్లాడ కుండా లోపలికి వెళ్ళిపోయింది.

— ఇది జరిగిన మూడోనాటిరాత్రి ఆ యింట్లో స్వరాజ్యం వొళ్ళువెచ్చబడింది. పిల్ల పడకగదిలో సత్యం పడుకున్నాడు

సమయం రాత్రి తొమ్మిది దాటింది. సత్యం లైటార్పి నిద్రపోవడానికి ప్రయత్నిస్తుండగా స్వరాజ్యం అక్కడికి వచ్చింది. అతని పక్కగా నించుని అన్నది.

'సత్యం...నిద్రపోతున్నావా?'

'లేదింక.'

'అవును సత్యం నువ్వొక్కడ ఒక్కడివీ పడుక్కుంటావుగదా...నీకు భయంకాదూ?'

సత్యం తేలిగ్గా నవ్వేసి అన్నాడు.

'భయమా? మావూళ్ళో మీ నాన్నగారి పొలంలో నేనొక్కడ్నీ పడుక్కునేవాలవాటు. అక్కడలేని భయం ... ఈవూళ్ళో ఇన్ని ఇళ్ళమధ్య ఈ ఇంట్లో నాకు భయమా? మీరు ఇవాళ అడుగుతున్నారుగానీ, రోజూ నేనిక్కడేగా పడుక్కుంటాను.'

'నీకేమొగాని, నాకైతే చచ్చేంత భయం బాబూ! ఈరాత్రి నాన్నా వాళ్ళు ఎప్పుడొస్తారో ఏమో, నేనొక్కదాన్నీ ఆ గదిలో వొంటరిగా పడుక్కోడానికి భయంగా వుంది. ఇవాళంతా డిటెక్టివ్ పుస్తకాలు చదవడంతోనే సరిపోయింది. నాన్నా వాళ్ళు వచ్చిం తర్వాత వచ్చేద్దువుగాని... అంతవరకూ నాకు తోడుగా వుండవూ?'

సత్యం చాలాసేపు ఆలోచిస్తూనే వున్నాడు.

'ప్లీజ్...రా సత్యం. అపుస్తకాలు చదవకపోయినా బావుండేది. రావూ?'

సత్యం లేచి నించోగానే స్వరాజ్యం లేడిపిల్లలా కేరింత గెంతుతూ గదిలోకి వెళ్ళింది. సత్యం తన పక్కబట్టల్తో ఆ పిల్లని అనుసరించేడు.

స్వరాజ్యం గదిలో సత్యం తన పక్కబట్టలు సర్దుకుంటూండగా స్వరాజ్యం అతన్ని అడిగింది.

'ఏమిటేది! ఇక్కడగూడా నువ్వు నేలమీద పడుక్కుంటావా సత్యం?'

'నేలమీద పడుకోడం నా కలవాటే!'

'పొలంలోనూ, వీధి అరుగులమీదా నేలమీద పడుక్కుంటే తోస్తుందేమో గాని గదిలో కూడానా సత్యం?'

'నా కెక్కడైనా ఫర్లేదు, మీరు ఆ మంచంమ్మీద పడుకోండి.'

స్వరాజ్యం మంచమ్మీద పడుక్కుంటూ 'మొండిఘటం' అనుకుంది.

సత్యం నిద్ర కుప్రకమిస్తుండగా మళ్ళా అతన్ని స్వరాజ్యం పలుకరించింది.

లైటు వేసా, తీసేయనా సత్యం?'

'మీ యిష్టం.' అన్నాడతను విరాగ్గా.

అవున్లే నేనేమి మాట్లాడినా నీకు విసుగ్గానే వుంటుంది. అవునుగాని సత్యం, నువ్వెప్పుడైనా ఇంగ్లీషు సినిమాలు చూసేవా?'

'ఏవో కొన్ని చూసేను.'

'ఏం చూసేవోగాని కొంచెం లేచి యిటు రా. ఈ బొమ్మ చూడు.' అన్నది స్వరాజ్యం నెమ్మదిగా.

సత్యం లేచి వెళ్ళలేదు.

'అబ్బ...కొంచెం చూచి వెళ్ళవయ్యా! నీ దుంప నిద్ర రోజూ వుండేదేగా!' స్వరాజ్యం మళ్ళా నెమ్మదిగానే అన్నది.

సత్యం లేచి ఆమె మంచం దగ్గిరికి వెళ్ళక తప్పిందికాదు.

సత్యం మనసులో గుబులు గుబులుగా వుంది. అంత ఖరీదైన గదిలో ఒక గొప్పింటి ఆడపిల్లతో వుండటమే నేరమని అప్పుడతనికి తోచింది. స్వరాజ్యం తన మంచంమ్మీద వెల్లకిలా పడుక్కునుంది. ఆమె కట్టుకున్న దుస్తులు అతి పలుచనవే గాకుండా, నాజూకైనవి అవడంతో పంకా గాలికి రెపరెప లాడుతున్నాయి.

స్వరాజ్యం అందంగానే వుంది. ఇప్పుడా పిల్ల ఏం అల్లరి చేస్తుందోనని సత్యం దిగులుపడ్డాడు. అక్కడా మంచం దగ్గరే నించుని స్వరాజ్యం చేతిలోవున్న ఫోటో వేపు చూచేందుకు ప్రయత్నం చేశాడు.

స్వరాజ్యం ఆ ఫోటోని గుండెల కద్దుముకుని మత్తుగా అన్నది.

'నువ్వలా స్తంభంలా నించుంటే నేని ఫోటో చూపించను. వొచ్చి నా మంచమ్మీద కూర్చో...'

సత్యం భయపడ్డాడు. ఏం చేయాలో తోచింది కాదు.

'ఫర్లేదు సత్యం కూచో ... ఇదిగో ఇప్పుడు చూడు ఈ ఫోటో ఇది ఇంగ్లీషు సినిమాలో ఒక దృశ్యం. ఈ అమ్మాయి పేరు ఎలిజబెత్ టైలర్. అందంగా వుంది కదూ. ఇతని పేరేమో రిచర్డ్ బర్టన్. పేరంత బావుండదు. నీకెలా వున్నాడో ఏమో. ఈ సినిమాలోలాగనే బయటకూడా వీళ్ళిద్దరూ భార్యా భర్తలే. చిత్రంగా వుంది గదూ. వాళ్ళు మొగుడూ పెళ్ళాలు గనుకనే సినిమాలో చాలా ఫ్రీగా ఏక్ట్ చేస్తారు. చూడు వాళ్ళిద్దరూ ఎంతెంత దగ్గిరిగా నించుని ఏం చేస్తున్నారో... నవ్వుతావేం సత్యం – కొంచెం దగ్గిరిగా జరుగు చెబుతాను... థాంక్స్ ... నవ్వుతుంటే ముద్దు పెట్టుకోడం ఏం తప్పుకాదనలు ...ఏమిటంత భయంగా చూస్తావు? లేపో మాపో కాలేజీ స్టూడెంటువి... నిజంగా నీ చదువు సాగివుంటే నాకు సీనియరువి...ఎందుకలా విస్తుపోతావు? ముద్దు గురించి మాటాడితే తప్పా? ఇంకొంచెం దగ్గిరిగా జరుగు సత్యం...థాంక్స్...



అప్పుడు సత్యం మొన్న గోపి బాబుని చూసే ... తగదా, అతను దాని దగ్గర సీదాగా వెళ్ల పోయేడా? అలా కాదన్నట్టు తలూపకు...వాడు. పోతే నేనే మాట్లాడుతాను. అయ్యో రామ...ఫోటోని నరిపేస్తున్నావేమిటి...నా పెద్ద వాడు సత్యం ...వుండయితే జైట్లార్వేస్తాను ... నువ్వు లేవకు...నువ్వు లేచి నుంచుంటే నన్ను చంపుకు తిన్నంత వొట్టు. అబ్బ కూచో మంటూంటే...థేంక్స్ సత్యం...'

* * *

'కనుక్కోవోయ్ పంతులూ! రైళ్లెంత సేపులో వస్తాదో!' అన్నారు బసవపున్నయ్య అసహనంగా.

పంతులు, విసిరిన బాణంలా వెళ్లివచ్చి వినయంగా అన్నాడు.

'నో లేట్ సార్...మరో పది నిమిషాల్లో అమ్మాయిగారూ, అల్లుడుగారూ ...మీ ముందు నించుంటారు.'

'మరి మనవరాలో!' పొట్టెగరేస్తూ అడిగేరాయన.

'అవునండోయ్ బాబు. నేనా సంగతే మరిచేను. మనవరాలుందిగా. బేబి...' ఆ మనవరాలి పేరు తెలీక పంతులు నసిగేడు.

'బేబి కాదోయ్ పంతులూ! సరచంద్రిక' పేరందించేరు బసవపున్నయ్య.

'ఎంత చక్కటి పేరండి బాబూ! శరశ్చంద్రిక!'

'అమెరికాలో పుట్టిందోయ్ నా తల్లి. దాన్ని అక్కడమ్మా నాన్న సారా అంటారట. ఇప్పుడు దానికి నాలుగో యేడు. నువ్వు దాని ఫోటోయి చూళ్లేదు లాగుంది. ఫోటోలేంటిలే......యేకంగా పిల్లనే చూడొచ్చు...ఈలోగా మనోళ్లకి డ్రింకు పట్టుకురా...పో...'

వాళ్లందరూ డ్రింకులు తాగుతున్నారు. సత్యానికి జ్వరం ఎక్కువైనట్టుంది. కంబళిని నిండుగా కప్పుకుని కూర్చున్నాడు. ఇంటిదగ్గర భార్యాపిల్లలూ—తమ్ముళ్లూ అతనికి గుర్తుకొచ్చేరు చెప్పా పెట్టకుండా రిక్షా ఎక్కి స్టేషను కొచ్చేసేడతను.

ఇవాళ రైల్లో స్వరాజ్యం భర్తతో వొస్తుందని అతనికి తెలీడంవల్ల—అంత జ్వరాన్ని లెక్క చేయకుండా స్టేషనుకి వచ్చేడు.

# శరశ్చంద్రిక

'స్వరాజ్యం అదృష్టవంతురాలు' అనుకున్నాడు.

ఆ పిల్ల బసవపున్నయ్య గారికి పుట్టడమే ఒకానొక చరిత్ర. బసవపున్నయ్య గారి రోజులు బావున్నాయి గనక, వారు ఢిల్లీలో ఒక అల్లుడ్ని వెతికి, అతనికి కట్నమిచ్చి, అతన్ని అమెరికా పంపి అవుననిపించుకున్నారు.

స్వరాజ్యం శరశ్చంద్రికనే కన్నది!

అప్పుడతనికి తన సొంత బేబి గుర్తుకొచ్చింది. ఆ పాప పేరు ఆనందలక్ష్మి. పేరులోనే వుంది కావలసినంత పేరక్షి! ఆ [illegible] అతి మామూలుగా పుట్టింది. సరైన [illegible] సత్యం దగ్గర తాహతు లేకపోవడంతో ఆ పాప అతి మామూలుగా పెరుగుతోంది. ఆనందలక్ష్మి పూరిక పుల్లలా వుంది; వొళ్లంతా గజ్జితో అసహ్యంగా కనిపిస్తూ 'నన్నెందుకు కన్నావు నాన్నా' అనే దీనమైన చూపుల్తో సత్యం మనసుమీద దెబ్బ తీస్తోంది.

తన యింట్లో ఆ పాపకి సుఖం లేదని సత్యానికి బాగా తెలుసు. తన నెత్తురులో దోషమేదో వుండివుంటుందని గూడా అతననుకున్నాడు.

సత్యం భార్యపేరు అన్నపూర్ణ. 'మహా సాధ్వి' అంటాడు సత్యం. 'అన్నపూర్ణకి కష్టాల్లో పెరగడం అలవాటైపోయింది. పుట్టింట్లో సవితి తల్లి పోరుతో కొన్నేళ్లు గడిచిన అనంతరం, సత్యానికి భార్యగా వచ్చి మరికొన్ని కష్టాలనుభవిస్తోందిక్కడ. షావుకారు కొట్లో లెక్కలు రాసే సత్యానికి భార్యగా అన్నపూర్ణే కాదు—మరో అరుంధతైనా సరే—కష్టాలనుభవించి తీరవలసిందే! గంతకు తగ్గ బొంతనుకుని తృప్తి చెందుతోంది కాబోలు అన్నపూర్ణ.

లెక్కలు రాసే ఉద్యోగం సత్యం సంపాయించుకున్న నెలలోనే, ఇద్దరి తమ్ముళ్లను తన దగ్గిరికి పంపి పోషించమన్నాడు తండ్రి. ఆ తమ్ముళ్లకి పొలం పనులు చాతకావనే సర్టిఫికేటును స్వయంగా తండ్రి యిచ్చేడు.

ఒక తమ్ముడు సైకిల్ షాపులోనూ, మరో తమ్ముడు మందుల షాపులోనూ పని చేస్తున్నారు. తమ్ముళ్లని ఉద్ధరించే జాతకం సత్యానికి లేకపోగా— తమ్ముడు పచ్చేలగా సైకిల్ని మూట కట్టేస్తున్నాడనే అపవాదుకి సత్యం భయపడుతూనే వున్నాడు.

ఆవేశంలో ఒకరి కొకరు తీసిపోరు తమ్ముళ్లు. చూస్తూంటే—కేవలం అన్నయ్యని ఉద్ధరించే నిమిత్తం అక్కడ పొలం పని మానుకుని వచ్చేరా అనే భ్రమ కలగనూ కలుగుతుంది.

'వెళ్లిపోండి తమ్ముళ్లూ...నేను అశక్తుణ్ని...నన్ను నమ్మి మీ బ్రతుకులు పాడు చేసుకోకండి' అని అన్నయ్య అంటే—

'మేము వెళ్లంగాక వెళ్లం. కలో గంజో మనం కలిసే తిందాం. మమ్మల్ని నువ్వు గానీ, నిన్ను మేముగానీ దూరం చేసుకోము. నువ్వు మా యింటికి పెద్దవాడివి. కొంచెమో గొప్పో చదువుకున్నవాడివి. నీ అదృష్టరేఖని దేవుడు నరికేయడం వల్ల నువ్వు కృంగిపోయావు. మా రెక్కలు మంచివే ఐతే అన్నా, ఇవాళ కాపోయినా రేపైనా ఆ దేవుణ్ని నిలబెట్టి నీ జాతకం తిరగరాయమని వేడుకుంటాం... మమ్మల్ని పొమ్మనకు......' అనేవాటి తమ్ముళ్ల వాళ్లు.

'ఇదంతా నేను చేసుకున్న పాపం...ఏ జన్మలో చేసేనో ఏమో... ...అనుభవిస్తున్నాను' అనుకున్నాడతను — ఆ రైలు స్టేషన్లో, ఆ పెద్దలకి దూరంగా, ఒక పాత సిమెంట్ బెంచీమీద కూర్చుని తలని చేతుల్లో వుంచుకుని...

దాదాపు అయిదు సంవత్సరాల క్రితం అతను చేసిన పాపమొకటి చప్పున స్ఫురించింది...

ఆనాటిరాత్రి—అప్పుడే—స్వరాజ్యం తొందరపాటువల్ల సత్యం తప్పు చేసేడు. ఆ తప్పు పూర్తయింతర్వాత దోషిలా లేచి నించున్నాడు సత్యం...

స్వరాజ్యం తన మొహాన్ని చేతుల్లో దాచుకుని అన్నది.

'వెళ్లిపో సత్యం. నాన్నావాళ్లు వచ్చే వేళయింది. నువ్వు వరండాలోనే పడుక్కో. వెళ్లు.'

పల్లె తాలూకు పొలంలో ఒంటరిగా పడుక్కోడం అలవాటైన సత్యానికి, ఆ రోజు లగాయితూ పట్టణంలో అన్ని ఇళ్లమధ్య ఆ భవంతి తాలూకు వరండాలో

పడుకోవడం భయంగానే వుండేది. ఏవేళ ప్పుడు ఏ కొంప ఎలా మునుగుతుందో, ఏ విపరీతం వినాల్సి వుంటుందోనని ఆందో ళనగా వుండేది.

సరిగ్గా కాలేజీ తెరిచేరోజున బసవ పున్నయ్యగారింట్లో 'కొంప మునిగిందనే' వార్త సత్యం చెవిలో పడింది. ఆవార్త విని సత్యం నేలమీద కుప్పలా కూలిపోయేడు.

'యెంత పన్జేసేవే సొరాజ్యం ముండా! ఆడెవడో జెప్పవే. గొప్పెదవేనా... నేనాడి కాళ్లట్టుగుంటాను. జెప్పు.' అన్నాడు తండ్రి...

స్వరాజ్యం ఆ వెధవ గురించి కళ్లతో ఏం చెప్పిందోగాని. ఆ తర్వాత బసవ పున్నయ్యగారు రుద్రులైపోయేరు.

'గొప్పెదేవకాదూ...అయితే యెవడాడు. ఆడి తలనరికి కప్పెట్టేస్తాను. యెవడు?'

స్వరాజ్యం ఏడవడం మినహాయించి మరేం చెప్పలేకపోయింది. తల్లి అడిగింది; తండ్రి మళ్లా అరిచేడు. అప్పటికీ చెప్ప కుండా వలవలా ఏడుస్తూనే వుంది స్వరాజ్యం. ఆరోజు రోజంతా ఇల్లంతా గోలగానే వుండిపోయింది.

ఆ రాత్రికి రాత్రి బసవపున్నయ్యగారు కారెక్కి దేశమ్మీద పడ్డారు—వరాన్వేషణ నిమిత్తం. ఆరాత్రే సత్యం స్వరాజ్యంతో మాట్లాడే అవకాశానికి నోచుకున్నాడు. అతనన్నాడు.

'క్షమించండి, తొందరపడ్డాం!'

స్వరాజ్యం తలెత్తి సత్యాన్ని చూచింది. ఆ పిల్ల కళ్లు ఎర్రగా మండిపోతున్నాయి. పెదాలు గబగబా వొణికిపోతున్నాయి. ఆస్థితి లోనూ ఆ పిల్ల చాలా ఖచ్చితంగా అన్నది...

'తొందరపడింది నేను సత్యం, నేను. నేను ఒక్కసారే తొందరపడ్డాను. రాణి చాలాసార్లు తొందరపడింది. నేనేమో తల్లి నవ్వబోతున్నాను. రాణి నిక్షేపంగా వుంది. ఇది నా దురదృష్టం...నాన్న నా లోపలి శిశువుని చంపుతానన్నాడు. అది విని నేనూ భయపడ్డాను అప్పుడు నాన్న ఏడ్చేడు. నాన్న వలవలా ఏడ్వడం—బహుశా యిదే మొదటిసారి, శిశువుకి ఏ హానీ జరగలేదు. భయపడకు...నీకు ఏ కీడూ జరగదు. నాన్న వెళ్లిపోయేడు చూసేవుగా. నాబిడ్డకి మంచి తండ్రికోసం వెదుకుతున్నాడు. నాకది

(47వ పేజీ చూడండి)

# ప్రొ॥ వి. రామలింగస్వామి



అఖిలభారత వైద్యశాస్త్ర పరిశోధనాసంస్థ (న్యూఢిల్లీ) లో పెథలజీ డిపార్ట్‌మెంట్ అధి పతిగా ఉన్న, ప్రొ. వి. రామలింగస్వామిగారు, పోషణ సరిగా లేకపోవడం వల్ల వచ్చే జబ్బుల్ని గురించి విశేష పరిశోధనలు జరుపుతున్నారు. వీరి పరిశోధనల్ని గుర్తించి చాలా సంస్థలు ఈయన్ని సన్మానించాయి. వైద్యశాస్త్రంలో శాంతి స్వరూప్ భట్నాగర్ బహుమానం, భారత వైద్య శాస్త్ర పరిశోధనా సమితి (ఐ. సి. యం. ఆర్.) వారి బసంతిదేవి అమీర్ చంద్ బహుమానం, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ వారి డి. ఎస్. సి. డిగ్రీ వీరికి లభించాయి. అంతర్జా తీయ పెథలజీ అకాడమీ (షికాగో) లో అబ్బాట్ లెక్చరర్‌గానూ, సిబా ఫౌండేషన్ (లండన్) లెక్చరర్‌గానూ, ఇంటర్నేషనల్ సొసైటీ ఆఫ్ జియోగ్రాఫికల్ పెథలజీ వారి ఆస్కాన్జీ లెక్చరర్ గానూ ఎన్నికైన మొదటి భారతీయుడు ఈయనే.

ప్రొ. రామలింగస్వామిగారు శ్రీకాకుళంలో పుట్టారు. 1946లో విశాఖపట్టణం ఆంధ్ర మెడికల్ కాలేజీలో యం. డి. డిగ్రీ తీసుకు న్నారు. 1951లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్శి టీలో పరిశోధనలు జరిపి పి. హెచ్. డి. డిగ్రీ తీసుకున్నారు. తర్వాత ప్రొ. రామలింగస్వామి గారి పరిశోధనలన్నీ మన దేశంలోనే జరిగాయి. వీరి ప్రచురణలు 70 ఉన్నాయి. ప్రామాణిక గ్రంథాల్లో అధ్యాయాలు రాసారు.

ప్రోటీన్‌లు లోపించడం వల్ల ఎదిగే పిల్ల లకి వచ్చే ఒకరకమైన జబ్బుని కనిపెట్టిన వారిలో వీరొకరు. ఈ జబ్బు మనదేశం లోనూ, అభివృద్ధి చెందుతున్న ఇతర దేశా ల్లోనూ ఎక్కువగా ఉంది. దీన్ని గురించి వీరూ, వీరి సహచరులూ ఇంకా పరిశోధనలు కొనసాగిస్తున్నారు. ఇదికాక వీరు గాయిటర్ అనే వ్యాధిని గురించి కూడా పరిశోధనలు జరి పారు. ఇది హిమాలయ ప్రాంతాల్లో ఎక్కువ. దీంట్లో కంఠంలో ఉండే థైరాయిడ్ గ్రంధి వాస్తుంది. ఉప్పులో కొంచెం ఐయొడిన్ కలిపి వాడితే దీన్ని అదుపులో పెట్టవచ్చని ప్రొ. రామలింగస్వామిగారి పరిశోధనలవల్ల తెలిసింది.

వైద్యవిద్యలో తీవ్రమైన సంస్కరణలు తేవాలనే ఉద్యమంలో ప్రొ. రామలింగస్వామి గారు ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు వీరికి గౌరవ డాక్టరేటు బిరుదు ఇచ్చారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు. హెచ్. ఒ.) వారికి ప్రొ. రామలింగ స్వామి సలహాదారు.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి.




### జ రి గి న క థ

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాథంగారు ఆ కుటుంబానికి ఆప్తుడు. సుందరం తెలివైన వాడు. అతనికి మద్రాసువెళ్ళి 'బియ్యే' చదవాలని వుంటుంది. మొదట్లో కొంత వెనకాడినా ముకుందం అతని అభిలాషని తోసిపుచ్చలేక పోయాడు. సుందరాన్ని అందరూ కలిసి మద్రాసు పంపిస్తారు. చదువుమీద శ్రద్ధచూపని శకుంతల మనస్తత్వం గ్రహించి ఒక మంచి సంబంధంచూసి పెళ్ళి చేసేస్తారు. సుందరం చదువు పూర్తి చేసుకుని వస్తాడు. ముకుందానికి పెళ్ళి అవుతుంది. విశ్వనాథంగారు చనిపోవడంతో ఆయన కొడుకులు అప్పు తీర్చమని తొందరపెడతారు. సుందరానికి గొప్పింటి సంబంధం కలిసివస్తుంది. అతనికి ఉషతో అట్టహాసంగా పెళ్ళవుతుంది. ప్రకాశాన్ని సుందరం దగ్గరుంచి మెడిసిన్ చదివించాలని యింట్లోవాళ్ళ అభిలాష.

## 8

బండిదిగి లోపలికి వస్తున్న ముకుందాన్ని చూసి మొదట కాస్త తెల్లబోయినా అంతలోనే తమాయించుకుని సంతోషంగా అతనికి ఎదురు వెడుతూ.

'ఏమేవ్, అల్లుడొచ్చాడు.' అంటూ లోపలికి వినిపించేలా సంబరంగా ఓ కేక వేశాడు యశోద తండ్రి నరసయ్యగారు.

'ఇప్పటిదాకా మీ మాటే అనుకుంటు న్నాం—రేపో ఎల్లుండో వుత్తరం ఏమైనా వస్తుందేమో అని—' అంటూ అభిమానంగా అల్లుణ్ణి పలకరిస్తూ అతని చేతిలో సంచీ అందుకుని 'లోపల పెట్టమ్మా' అంటూ చిన్నకూతురు చేతి కిచ్చాడు—మామా అల్లుడు వరండాలో వున్న బల్లమీదకూర్చున్నారు.

'అంతా బాగున్నారా—వదినగారి వంట్లో కులాసాగా వుంటోందా.' అంటూ పలకరించింది అత్తగారు గడపవారే నిలబడి.

'అంతా కులాసాగానే వున్నారు.' అంటూ మర్యాదగా సమాధానం చెప్పాడు ముకుందం.

కాళ్ళు కడుక్కోటానికి చెంబుతో నీళ్ళూ తుడుచుకోటానికి తువ్వాలూ తీసుకొచ్చిన రాధిక—

'ఏమిటి బావా అప్పుడే వచ్చావు. అన్యాయంగా నేను పది రూపాయలు పోగొట్టుకొన్నాను 'అంటూ అలక నటిస్తూ నీళ్ళ చెంబు చేడింవార పెట్టింది.

'చాల్లే పిచ్చివాగుడు' అంటూ నరసయ్యగారూ భార్యా కూతుర్ని మందలించారు, అల్లుడి స్వభావం తెలిసిందే అయినా ఓ వేళాపాళా లేకుండా హాస్యాలు చేస్తే అతనేమైనా అనుకుంటాడేమోనని పించి.

అతను ఏమీ అనుకోలేదు —నవ్వుతూనే మరదల్ని అడిగాడు, 'ఆ పదీ ఎలా పోగొట్టుకున్నావో చెప్పావుకాదు మరి.'

'ఆ ఏముంది — టెలిగ్రాం అందగానే ఇవ్వాళో రేపో నువ్వు వచ్చేస్తావు' అంది అక్కయ్య—అహ అలాగేం రాడు, ఒకవేళ బావ వస్తానన్నా అత్తయ్యగారు ఒప్పుకోరు, అందరూ కలిసి ఏ పదకొండో రోజుకో వస్తారు అన్నాను నేను...కాదు నువ్వు తప్పకుండా వస్తావూ అంది అక్కయ్య—పదేసి రూపాయలు పందెం వేసుకున్నాము...

అత్తగారూ మామగారూ ముసి ముసిగా నవ్వుతూంటే పసివాడిలా బిడియపడి పోయాడు ముకుందం.

స్నానంచేసి వచ్చాక మరదలు ఇచ్చిన కాఫీగ్లాసు అందుకుంటూ ఆ పిల్లమొహం లోకి చూసి చిన్నగా నవ్వాడు — బావగారి చూపులు అర్థం గ్రహించుకున్నట్లు, 'అక్కయ్య అదిగో ఆ చివరిగదిలో వుంది—వెళ్ళు పాపం—శాంతి అది ఏమీలేదుట—పాపనికూడ చూడొచ్చు—అన్నీ అత్తయ్య గారు చెప్పకుండా వుంటారా ఏమిటిలే.' అంది రాధిక మూతి మూడువంకర్లు తిప్పుకుంటూ.

'తల్లీ తల్లీ—ఆ పదిరూపాయలూ నీకు నేను ఇచ్చుకుంటాను కాని ఇలా నామీద మాత్రం రుసరుసలాడకు.' అన్నాడు ముకుందం బతిమాలుకుంటున్న ధోరణిలో.

'దానిమొహం—ఏదో హాస్యం చెయ్యక పోతే తోచదు.' అంది కాంతమ్మగారు నవ్వుకుంటూ:

కాఫీగ్లాసు చేతిలోపట్టుకుని ఆ చివరి గదివేపు అడుగులువేస్తున్న ముకుందం కాళ్ళు ఒక్కక్షణం తడబడినట్లయాయి—అతనికి చెప్పలేనంత సంతోషంగానూ వుంది—ఏదో బిడియంగానూ వుంది. మొట్టమొదటిసారి యశోద మొహంలోకి చూచినప్పుడు తనకెలాంటి అనుభూతి కలుగుతుందో వూహకే అందటం లేదు.

యశోద పరిస్థితికూడ అచ్చంగా అలాగే వుంది. తెరుచుకుంటున్న తలుపులవంకే చూస్తున్నదల్లా ఒక్కసారి బిడియంగా

చూపులు వాల్చుకుంది.

ఎదుటి దృశ్యాన్నిచూస్తూ చూపులు మరల్చుకోలేని వాడిలా అలా గుమ్మందగ్గరే నిలబడి పోయాడు ముకుందం ఒక్కక్షణం.

రేగిన జుట్టు, కొద్దిగా పాలిపోయిన చెక్కిళ్ళు, కొద్దిగా బలహీనంగా వున్న యశోదమొహంలో ఏదో కొత్తదనం మెరిసి పోతూన్నట్లనిపించింది.—కళ్ళు మూసుకుని అమాయకంగా నిద్రపోతున్న పాపవంక తదేకంగా చూసుకుంటున్న యశోదకళ్లల్లో అనిర్వచనీయమైన అనురాగభావం — ఆ దృశ్యం అత్యంత మనోహరంగా కనిపించిందతనికి—కాస్సేపటి తరువాత మెల్లిగా వెళ్ళి అక్కడున్న కుర్చీలో కూర్చుంటూ, 'యశూ' అన్నాడు. అతని గుండెలలోని ఆప్యాయతంతా రంగరించి పోసినట్లుంది ఆ పిలుపు.

కళ్ళు ఎత్తి చూసింది యశోద.

'నేనొకటి అడుగుతాను—చెప్తావా మరి—' ఎంత అమాయికత్వం నటించబోయినా అతని చూపులు నవ్వు దాచుకోలేకపోయాయి.

ఒక్కసారి సిగ్గుపడిపోయింది యశోద. 'ఏమిటది' అన్నట్లు చూపులలోనే అడిగింది.

'ఇప్పుడు మా ఇద్దరిలో నీకు పాప అంటే ఎక్కువ ఇష్టమా నేనంటేనా—చెప్పాలి మరి.'

చటుక్కున సమాధానం చెప్పటం ఇష్టం లేని దానిలా ఎటో చూస్తూ వూరుకుంది ఒక్కక్షణం. ఆ తరువాత 'ముందు, మీ సంగతి చెప్పండి' అంది.

'అద్దుగో—చూశావా—నీకు పాప అంటేనే ప్రేమ ఎక్కువ—అది చెప్పటం ఇష్టం లేక మాట తప్పిస్తున్నావు'

సిగ్గైన చిరునవ్వు మెరిసింది యశోద పెదవులమీద. 'అలా నిలదీసి అడిగితే నేనేం చెప్పలేకపోతున్నాను—నాకు ఇద్దరూ సమానమే—'

'ఏం కాదులే—నాకు తెలుసు—పిల్లలు పుట్టగానే ఆడవాళ్లకి భర్తలమీద ప్రేమ తరిగిపోయి అందరా పిల్లలమీద మక్కువగా మారిపోతుందట—మేం మాత్రం అది వరకటికంటె కూడ ఎక్కువగా మిమ్మల్ని అభిమానించి ఆరాధిస్తాము' [illegible] [illegible] వేసుకున్నాడు.

దానికేమీ సమాధానం చెప్పకుండా, 'ఆ గ్లాసులోది కాఫీ కాబోలు, చల్లారి పోతుంది, త్రాగేయండి.' అంది నవ్వుతూ.

'గొప్ప సలహా ఇచ్చావులే' మూతి ముడుచుకున్నాడు ముకుందం—నవ్వుకుంది యశోద—

'అత్తయ్యగారు ఎప్పుడు వస్తారు-నాకు పథ్యంపెట్టాక ఉత్తరం వ్రాయించాలనుకుంటున్నాడు నాన్న.'

'నాకు అలాంటి వేడుకలూ అవీ ఏం ఇష్టం వుండదని నీకు తెలుసుగా—ఇంక ఆవిడికి మనవరాలిని ఎప్పుడు చూడాలనిపిస్తే అప్పుడే వస్తుంది.'

'శశి ఏమంటోంది?'

'ఏమంటుంది—కోడల్ని ఎంత త్వరగా చూస్తానా అని ఎదురు చూస్తోంది—అన్నట్లు నీకోమాట చెప్పమంది, అవాళ శకుంతలా మాట ఇచ్చేసింది కదూ—ఇంక రమణికి కూతురు పుట్టినా ఆ ఛాన్సు మన పాపదేనుట...'

'ఎప్పుడో జరగబోయేదానికిప్పటి నుంచీ అనుకోటం ఎందుకులెండి—' యశోద మురిపెంగా కూతుర్ని చూసుకుంటూ అంది—'రమణి దగ్గరనుంచి వుత్తరాలు వస్తున్నాయా—కులాసాగా తిరుగుతోందిటనా—సుందరం వెళ్ళి నెలకావస్తున్నట్లుంది—వుత్తరాలు వస్తున్నాయా...'

'ఆ—అంతా కులాసాగానే వున్నారు.



అమ్మమాత్రం అర్థం లేకుండా బెంగ పెట్టేసుకుంటోంది—ఆ చదువు ఎప్పటికి ముగుస్తుందో మళ్లీ ఎప్పటికి వస్తాడో కన్నబిడ్డని ఎన్నాళ్లకి చూసుకుంటాడో అంటూ వూ ఇదయిపోతోంది — అసలు వాళ్ళు నిశ్చింతంగా సంతోషంగా వున్నారు...'

'ఆవిడ అభిమానం అలా అనిపిస్తుంది—మరి—పైగా ప్రతిదానికి భయం, అనుమానం ఎక్కువ.' అంది యశోద, ఆశ్చ

గారి భయం ఏమిటో ఆమెకి తెలుసు.

* * *

'పోస్ట్' అన్న కేక వినిపించింది. గదిలో పేపరు చదువుకుంటున్న ముకుందం లేచి వెళ్ళాడు—జులుబు భారంగా వుండటంవల్ల అవాళ ఆఫీసుకి శలవపెట్టి ఇంట్లోనే వుండిపోయాడతను.

అతను వరండాలోకి వెళ్ళేసరికే ఓకవరు అక్కడి బల్లమీద పడేసి వెళ్ళిపోయాడు పోస్టుమేన్.

'శకుంతల వ్రాసింది. అనుకుంటూ కవరు చించి లోపలి కాగితాలు పైకితీసి చదవటానికి వుపక్రమించాడు—నాలుగు పంక్తులు చదివేసరికే అతని మొహంలో రంగులు మారిపోవటం ప్రారంభించాయి—చివరికి వుత్తరం ముగించేసరికి చెప్పలేనంత చిరాకు విసుగుదల కలిగాయి.

'అమ్మా ఒక్కసారి ఇలా వస్తావా' అంటూ తల్లిని పిలుస్తూ తనే లోపలికి నడిచాడు అడ్డదిడ్డంగా ఆ కాగితాలు మడతలు పెడుతూ.

నడవలో గోడవార కొంగు పరుచుకుని పడుకున్న సుభద్రమ్మగారు లేచికూర్చుంటూ 'ఉత్తరాలు వచ్చినట్లున్నాయి—ఎక్కడ్నించి' అంది.

'నీ పెద్దకూతురు వ్రాసింది.' కొడుకు గొంతులో అంత కోపం, వెటకారం ఎన్నడూ ఎరగని ఆవిడ గతుక్కుమంది—అతని మొహంలోకి చూడాలంటేనే ఏమిటో ధైర్యం లేనట్లుగా అయిపోయింది.

'ఇదుగో చదివి వినిపించు' అంటూ కాగితాలు విసురుగా భార్య వడిలో పడేసి గదిలోకి వెళ్ళిపోయాడు.

అత్తగారి గది గుమ్మంలో కూర్చుని చంటి దానికి జుబ్బా కుడుతున్న యశోదకి కూడ భర్తవైఖరి వింతగానే అనిపించింది—చేతిలో వస్తువులు ప్రక్కని చాపమీద పడేసి కాగితాలు విప్పింది కుతూహలంగా.

'ఏం రాసిందేమిటి — వాడలా మండిపడిపోతున్నట్లున్నాడు.'—అత్తగారు అడిగిన దానికి సమాధానంగా వుత్తరం చదవటానికి వుపక్రమించింది యశోద — అది ముగించేసరికి ఇద్దరి మొహాల్లోనూ ఆశ్చర్యము బాధా పరుచుకుపోయాయి—

'యశోద అయోమయంగా అత్తగారి ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది,

## ఆశలూ అనుభవాలూ

'ఏమిటిలా చేశాడు' అనుకుంటూ దిగులుగా నిట్టూరుస్తూ, కాళ్ళూ చేతులూ పట్టు తప్పిపోయి లేవటానికి ఓపికలేనట్లు అలాగే కూర్చుండిపోయింది సుభద్రమ్మగారు.

గదిలోకి వెళ్ళిపోయిన ముకుందానికి అక్కడా మనస్సు నిలవలేదు.

'మొన్న వచ్చినప్పుడు కాని ఈ సంగతేమయినా మాచాయగా నీతో చెప్పిందా.' మళ్ళీ అన్నాడు లేచివచ్చి.

'అబ్బే ఏమీచెప్పలేదు—కాని అదిమాత్రం మునుపటిలా సరదాగా వుత్సాహంగా లేదేమోనని ఇప్పుడు అనిపిస్తోంది — అసలేం జరిగిందో...'

'జరగటానికేముంది అమ్మా— నేను చెప్తాను విను. ఉద్యోగం అన్నాక ఎన్నో కష్టనిష్ఠూరాలని సహించి ఒళ్ళువంచి పనిచేయాల్సి వుంటుంది—పై అధికారుల దగ్గర అణిగి మణిగి అణుకువగా మసలుకోవలసి వుంటుంది— కానీ నీ అల్లుడిలో ఆ నిదానం, ఓర్పు మచ్చుకైనా లేవు— అతనిలో అంతులేని అహంకారం అర్థంలేని అహంభావం బాగా పేరుకుపోయాయి— అతని మాటలు వింటూంటే నాకు ఒక్కొక్కసారి ఎంతో ఆశ్చర్యం వేస్తూండేది.

తనకి డబుల్ డిగ్రీ వుందనీ, ఆఫీసులో అందరిలోకీ తనే తెలివైన వాడిననీ విర్రవీగుతూండేవాడు — చివరికి వాళ్ళ ఆఫీసరుకూడ వీళ్ళనీ వాళ్ళనీ కాకాపట్టి ఆ పొజిషన్‌లోకి వచ్చాడేకాని వాడిబుర్రలో మట్టితప్ప మరేమీలేదని ఖబుర్లు చెప్తూండేవాడు—అంతేకాదు, 'నాపై అధికారికదా అని నా పనిలో ఏవో లోపాలు ఎంచాలని వూ తాపత్రయ పడిపోతాడు. నేనేం తనలా చచ్చుదద్దమ్మని కాను తప్పులు చెయ్యటానికి—అట్టే పిచ్చి వేషాలు వేశాడంటే ఆ ఫైళ్ళు వాడి మొహాన పడేసి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి నా దారిన నేను చక్కా వస్తాను.' అనికూడా అన్నాడొకసారి—బావ ధోరణి నాకు వింత అనిపించినా ఆ మాటలని మాత్రం నేను అంత సీరియస్‌గా తీసుకోలేదు అప్పుడు—'

కొడుకు చెప్తున్న విషయాలు కొన్ని కొత్తగానే వున్నాయి, కాని అల్లుడి ధోరణి మాత్రం పూర్తిగా తెలియనిది కాదు ఆవిడకి—

పెళ్ళిలో అతను తమతో కలివిడిగా లేడనీ మనస్సువిప్పి ఎవ్వరితోనూ మాట్లాడలేదనీ కొడుకులు అన్నప్పుడు అదంతా పెళ్ళికొడుకు దర్పాలనీ ఆ తరువాత మామూలుగానే కలిసిమెలిసి వుంటాడనీ తను చెప్పింది—కాని నాల్గైదు సంవత్సరాలు గడిచినా అల్లుడి ప్రవర్తనలో చీమ తలకాయంత మార్పయినా కనిపించలేదు ఆవిడకి—పండగలకీ పబ్బాలకీ రావటం ఇద్దరు పిల్లలకీ బాలసారెలూ అవీ వేడుకలు చేసుకోటం, వచ్చినప్పుడల్లా నాలుగైదు రోజులుండటం అన్నీ బాగానే వున్నాయి, కాని అలా వచ్చినప్పుడు అతని ప్రవర్తన మాత్రం కాస్త ఏదోలాగే వుంటుంది — బావమరదులతో సరదాగా హాస్యాలాడుతూ ఖబుర్లు చెప్పకుండా కొత్త పెళ్ళికొడుకులా, తలుపులు బిడాయించుకుని, గదిలో కూర్చుంటాడు— అతనికి కావలసినవన్నీ పెళ్ళామో ఎవరో తీసుకువెళ్ళి అందించటం ఆ రాజసం అదీ చూస్తూంటే ఒకోసారి చిరాకనిపించినా అతని తీరే అంత అని సరిపెట్టుకుంది— అతిశయమో, గర్వమో ఏదో ఒకటి, వాళ్ళబ్రతుకు వాళ్ళు బ్రతుకుతున్నారు అనుకుంటూంటే మధ్య ఈ మేళం ఏమిటి—ఏమో ఆడదాన్ని,— నాకు ఆ ఆఫీసు వ్యవహారాలు ఏం తెలుస్తాయి— అనుకుంటూ.

'పోనీ అంతగా ఆ వుద్యోగం నచ్చకపోతే మరోటి చూసుకున్నయినా మానేస్తే బాగుండేది.' అంది.

'అంత ఆలోచనే అతనికి వుంటే ఇంక లేనిదేముంది— ఒక్కవిషయం మనం తెలుసుకోవాలమ్మా ... మనిషికి ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం వుండాల్సిందే. కాదనము—కాని అవి అర్థం పర్థం లేకుండా పెరిగిపోయి చివరికి అహంకారంగా, అహంభావంగా పరిణమిస్తే మాత్రం ఆ వ్యక్తికి పతనం తప్పదు...'

'అదంతా నిజమేలే-ఏదో అయిపోయింది మరి—ఇప్పుడు మనం ఏం చెయ్యాలి—' ఆశగా కొడుకు కళ్ళలోకి చూసింది.

'చెయ్యటానికేముంది — అదీ మనమూ

# కేమెల్ సిరా దివ్యముగా ఉంటుంది!
# వీటిలో దేనినైనా ఎంచుకోండి




## కేమెల్ "స్పెషల్" సిరా

అడ్డు లేకుండా జారే యీ సిరా సరసమైన ధరలో లభిస్తోంది. ప్రతి రోజు వాడుకకు అది దివ్యముగా ఉంటుంది. అది త్వరగా ఆరిపోతుంది. పెన్ను, మధ్యలో రాయడము ఆగిపోదు. మీ పెన్నులో కేమెల్ స్పెషల్ సిరా పోస్తే, రాస్తున్నప్పుడు పెన్నును విదిలించనక్కర లేదు. ఇంత మంచి సిరా అయినా దాని ధర సరసముగా ఉండడమే కేమెల్ "స్పెషల్" సిరా ప్రత్యేకత.




## కేమెల్ "డి-లక్స్" సిరా

ఇది మా క్రొత్త తయారు. మీది ఖరీదైన పెన్ను అయితే, దానికి బాగుగా తగిన సిరా యిదే. ఈ సిరా అడ్డు లేకుండా జారుతుంది, త్వరగా ఆరిపోతుంది మరియు అది రాస్తూనే మీ పెన్నును శుభ్రపరుస్తుంది. అంతే కాదు, "డీలక్స్" మీ పెన్నుకు సంపూర్ణ రక్షణ నిస్తుంది. దానిని వాడితే పెన్ను చిన్న ముక్కలుగా ఊడదు. మీ టేబుల్ మీద కేమెల్ "డీలక్స్" సిరా బుడ్డిని పెట్టుకొనుట మీకు గర్వ కారణముగా ఉంటుంది. అది మీ టేబులుకు ఆకర్షణ నిస్తుంది. అది ఎంత సొగసుగా ఉంటుందో అంత నాణ్యమైనది కూడాను.

vision 630 tel

# ఆశలూ – అనుభవాలూ

కూసి తుర్పునా తిరిగి ఓ నమస్కారం పెడ్దాం,'

'అబ్బ— అది కాదు ... ఏదో మాటా మాటా వచ్చి మానేశాడే అనుకుందాం— మరోటి సంపాదించుకోలేని తెలివి తక్కువ వాడేం కాదు—అదే ఎంతో ఇబ్బందిపడుతూ ఒకే విధంగా దేవుళ్ళాడుతూ వ్రాసింది.' కస్సుమన్నాడు ముకుందం. 'అడిగివుండి వుద్యోగం చేసుకోటానికి ఆత్మాభిమానం అడ్డొచ్చింది కాని, అత్తవారి నడిగి డబ్బు తెప్పించుకోటానికి పౌరుషం అడ్డురాలేదా.'

గతుక్కుమంది సుభద్రమ్మగారు. అంతలా మండిపడిపోతున్న కొడుకుతో ఇంకేం మాట్లాడాలో తోచలేదు ఆవిడకి— తల్లి మౌనాన్ని ఆధారం చేసుకుని మళ్ళీ అతనే అన్నాడు.

'ఒక్క వందరూపాయిలు పంపించాలిట, వందరూపాయిలు — రూపాయిలు ఇక్కడేమయినా కుప్పలు పోసుకు కూర్చున్నాం అనుకుందా— మనం ఎన్ని ఇబ్బందులు పడుతున్నామో ఎలాంటి అవస్థలు పడుతున్నామో దానికామాత్రం తెలియక్కర్లేదూ—అదేం జ్ఞానంరాని పసిపిల్లకాదే... మనకెన్ని చిక్కులున్నా వాళ్ళకెలాంటి లోపమూ జరక్కుండా అన్ని అచ్చటలూ ముచ్చటలూ జరిపే పంపిస్తున్నాంగా— ఇంకా రోజూ అంటే ఎక్కడ్నించి తెస్తాను. ఎలా తెస్తాను...'

ఎప్పుడూ లేనిది కొడుకు అలా చిరాకు వేస్తున్నట్లు మాట్లాడుతూంటే సుభద్రమ్మగారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పుట్టెడు దుఃఖం ముంచుకు వచ్చింది— కొంగులో కళ్ళు వత్తుకుంటూ [illegible] అంది—

'ఏమయ్యిందో ఏం జరిగిందో మనకి తెలియదు— ఇదే మానేశాడో వాళ్ళే తీసేశారో మరి— [illegible] అంత శక్తి లేకుండా చూస్తూ చూస్తూ మూడువందల రూపాయిల ఉద్యోగం మానుకుంటాడా—అక్కడ ఎన్ని ఇబ్బందులు పడుతున్నారో—అసలే ఆ మామగారు చండశాసనుడు— ఎన్నిమాటలంటున్నాడో—అవసరంలో ఆదుకోటానికి నా అనే వాళ్ళు వున్నారు అని అని గంపంత ఆశతో రాస్తే మనంకూడ...' ఆ పైన మాటలు పెగలలేదు ఆవిడకి.

'అమ్మా ! ...' ముకుందం గొంతు రుద్ధమైపోయింది.

'నీకు నామీద కోపంవచ్చింది కదూ, నేనెంత బాధపడుతూ ఆ మాటలన్నానో నీకు తెలియదు— బావ చేసిన పని సమర్థనీయంగా లేదు అనే ధోరణి తప్పితే చెల్లాయిమీద నాకెలాంటి విరోధమూలేదు— తను ఇబ్బందులు పడుతూంటే ఏమీ పట్టించుకోకుండా వుండగలగటం కూడా నావల్లకాదు...' అనేసి మరి అక్కడ నిలబడకుండా వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

మరో పావుగంట తరువాతే అతను బట్టలు మార్చుకునివచ్చి జోళ్ళు వేసుకుంటూంటే, 'ఇప్పుడెక్కడికి వెళ్తావు.' అని నోటి చివరదాకా వచ్చినమాటలనే మళ్ళీ మింగేసి గుడ్లు అప్పగించి చూస్తూ కూర్చుంది సుభద్రమ్మగారు.

'ఓమూల వంట్లో బాగుండలేదు అంటూ ఇవాళే అంత హడావిడి పడకపోతే ఆ పిల్లాడేదో రేపు చెయ్యకూడదా.' అందామనుకున్న యశోదకూడ మౌనంగా అత్తగారివంకా భర్తవంకా చూస్తూ నిలబడిపోయింది.

ఓగంట తరువాత తిరిగి వచ్చిన ముకుందం వంద రూపాయలకి డ్రాఫ్టు ఓకవరూ భార్యచేతిలో పెడుతూ 'అమ్మ నడిగి వుత్తరం వ్రాసి ప్రకాశంచేత పోస్టు చేయించు' అన్నాడు.

* * *

బావమరిది పంపించిన వంద రూపాయిలూ చూడగానే మోహన్ మనస్సు కుదుటపడింది— ఈ మధ్య డబ్బుకి మరీ కటకటగా వుంది.

ఆనాడు ఒళ్ళు తెలియని కోపంతోనూ, నాకేం తక్కువ, చేతిలో డిగ్రీవుంది అనే అహంకారంతోనూ పెద్ద చిన్నా అనే ఆలోచన లేకుండా నోటికి వచ్చినట్లు మాట్లాడేశాడు — తీరా వాళ్ళు వుద్యోగంలోంచి డిస్మిస్ చేస్తారేమో అన్నస్థితి వచ్చేసరికి తన పరువు కాపాడుకోటానికి రిజైన్ చేసి వచ్చాడు—చేతిలోవున్న డబ్బుతో కొద్దిరోజులూ, ఇక్కడా అక్కడా చేబదుళ్ళు తీసుకున్నడబ్బుతో మరి కొద్ది రోజులూ గడిచాయి—చేసిన ప్రయత్నాలన్నీ ఏమవుతున్నాయో! చేతిలోవున్న రెండు డిగ్రీల విలువా ఏమయిపోయిందో కాని

వుద్యోగంమాత్రం దొరకలేదు.

అప్పుచేసుకుని తింటూ ఎన్నాళ్లిక్కడ వుండగలం అనుకుని ఇల్లు ఖాళీచేసి మూటాముల్లే చంకన పెట్టుకుని తండ్రి దగ్గరికి వెళ్లిపోయారు.

కొడుకు రిజైన్‌చేశాడని తెలియగానే, 'పోనీలే—బొత్తిగా మంచీ మర్యాదాలేని చోట్లా, మనకి విలువ లేనిచోట నౌఖరీ ఎన్నాళ్లు చెయ్యగలవు—నీకేం ఫరవా లేదు. మూడోనాటికి దాని తాతలాంటి వుద్యోగం దొరుకుతుంది.' అంటూ ధైర్యం చెప్తూ వుత్తరం వ్రాసిన తండ్రి, కొడుకు కుటుంబంతోపాటు వచ్చేయటంతో కాస్త బెంబేలెత్తి పోయాడు—లాంఛనంగా పలకరింపులూ అవీ అయాయి — రోజులు గడిచిపోతు న్నాయి. అరడజను కాస్తా గడచిపోతోంది. కాని తల్లిదండ్రుల వైఖరిలోనే ఏదో మార్పు వస్తున్నట్లు కనిపెట్టాడు మోహన్—ఇంక శకుంతల అయితే అత్తమామల పుల్లవిరుపు మాటలు భరించలేకనూ, అవి పెదవి విప్పి భర్తతో చెప్పుకుంటే ఆ చిరాకులో అతను తనమీదే విరుచుకు పడతాడేమో అనే భయంలోనూ లోలోపలే కుమిలిపోతోంది.

'తోచినమట్టుకు చదువు చెప్పిస్తారు. పెళ్లి పేరంటం చేస్తారు. ఎక్కడో నాలుగురాళ్లు సంపాదించుకుని ఎవరి బ్రతుకు వారు బ్రతుకుతారంటూనే అభిమానం గౌరవం వుంటాయికాని ఏపనీ లేకుండా, పైసా సంపాదన లేకుండా ఇంట్లో కూర్చున్నవాళ్లు తల్లిదండ్రు లకి కూడ లోకువే అయిపోతారు.' అను కునేవాడు మోహన్ కసిగా.

ఏడుస్తున్న పిల్లవాడి చేతిలో అణా పెట్టి పిప్పరమెంట్లు కొనిపెట్టటానికి, పసిపిల్లకి పాండ్సుపౌడరు కొనటానికి కూడ ప్రత్యేకం లెఖ్ఖలుచెప్పి తండ్రిదగ్గర డబ్బు తీసుకోవాలంటే అతనికి ఎలాగో వుండేది—కోపం, ఉడుకు మోత్తనం వచ్చేవి—అయినా అడిగి తీసుకుని అవస రాలు గడుపుకోటంతప్ప మరో మార్గం లేదు—లక్ష ప్రశ్నలు వేసి, అసలు ఆ అవ సరం అంత అర్జెంటుగా తీర్చుకో వలసింది అవునో కాదో అని అంచనాలు కట్టి చివరికి కొడుకు అడిగినదాంట్లో సగమే చేతిలో పెట్టేవాడు తండ్రి.

అలాంటి వాతావరణం మోహన్‌లో పౌరుషాన్ని వివేకాన్ని మేలుకొల్పి, మంచీ చెడూ తెలుసుకునేలా చేసి,

'ఏమిటీ అవస్థ—ఇలా ఇన్ని అవమా నాలు పడుతూ ఎన్నాళ్లు ఇక్కడ వుండ గలను—ఎంత చిన్నదయినా సరే ఓవుద్యోగం అంటూ దొరికితే చేరిపోతాను.' అనే ఆలోచనలు కలిగించటానికి బదులు అతన్ని మరింత రెచ్చగొట్టి మరీ మూర్ఖుణ్ని చేశాయి.

'ఏమిటి ఈయన దాష్టీకం — నాకేం ధర్మం చేస్తున్నా ననుకుంటున్నాడు కాబోలు—ఈసారి ఇలాంటి అడ్డదిడ్డం లెఖ్ఖలు అడిగాడంటే మరి వూరుకోను—ఆస్తి ఏంచేసినా నా వాటా నాకు పారెయ్య మని చెప్తాను—నాకు నచ్చిన వుద్యోగం దొరికేదాకా ఆ ఆస్తిలో మహారాజులా బ్రతకొచ్చు!' అన్నాడు ఓరోజు భార్యతో —శకుంతల హడలిపోయింది — భర్త నిజంగా అంతపనీ చేస్తాడేమోనని భయపడ పోయింది.

'మిగిలిన వాళ్లంతా ఇంకా చిన్నవాళ్లు —కావలసిన కార్యాలు చదువులు బోలెడు

---

# రచయిత(త్రు)లకి మనవి

కొందరు పాఠకులు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పడే రచనలు చేసినవారి చిరునామా కోసం రాస్తూ ఉంటారు. ఈ సమాచారం రచయిత (త్రు)ల అనుమతి లేనిదే తెలుపటం వీలుకాదు. కాబట్టి తమ చిరునామా ప్రచురణకి అభ్యంతరంలేని రచయిత (త్రు)లందరూ తమ వ్రాత ప్రతుల మీద ఆ విధంగా పేర్కొంటే బాగుంటుంది. (సం)

---

పయి ప్రకటన దృష్ట్యా ఏటి పరిస్థితులలోనూ రచయిత(త్రు)ల చిరునామాకోసే ఉత్తరాలకి సమా ధానం ఇవ్వటం జరగదు. సం)

---

ఖర్చుంది—ఈ స్థితిలో ఈయన ఆస్తి పంచమంటూ పేచీ పెడితే ఎలాంటి గొడవలు వస్తాయో—అసలే ఇంట్లో, అందరూ ఒకరిని మించిన పౌరుషవంతులు మరోకరు—ఎప్పుడూ ఎందుకో అందుకు ఒకరిమీద ఒకరు అములూ ధూములూ చేసుకోటంతోనే సరిపోతుంది—వాటికి తోడు ఈ కొత్తరగడ ఒకటి తీసు కొస్తారా ఈయన—పదిమందీ ఏమను కుంటారు, ఎంత అప్రతిష్ఠ.' అను కుంటూ.

'ఇప్పుడాసంగతి ఎందుకులెండి'. అంది భర్తతో.

'లేకపోతే ఏమిటే మరి,' అన్నాడతను రుసరుసలాడుతూ.

చివరికి శకుంతలకో వుపాయంతొచింది.

'ఒక్క వందరూపాయలు పంపించమని మా అమ్మకి వ్రాస్తాను. మీకు వుద్యోగం దొరికేదాకా వాటితో సర్దుకోవచ్చు.' అంది చెదురునా అతని కళ్లల్లోకి చూస్తూ.

మోహన్ వుద్యోగం మానేసి నాలుగు నెలలు కావస్తున్నా ఇంతవరకూ అత్తవారి కా వార్త తెలియనివ్వలేదు— 'చూడు శలవ పెట్టి మనవూరు వెళ్తున్నాం అని వ్రాయి—అంతేకాని మిగిలిన రామాయణ మంతా రాయక్కర్లేదు' అని అజ్ఞాపిం చాడు భార్యని అనాడు ఇక్కడికి వచ్చే ముందురోజు—మరి ఇవాళ తన ఆలోచ నని అతను ఎలా అర్థం చేసుకుంటాడో నని కాస్త తటపటా యించింది కాని, చేతిలో చాని లేక బొత్తిగా పరాధీనపు బ్రతుకు గడుపుతున్న మోహన్‌కి భార్య మాటలు వింటూనే ప్రాణం లేచివచ్చి నట్లయింది—'కన్నతండ్రి అయితేమాత్రం అన్ని చివాట్లు పెడుతూంటే కుక్కిన పేనులా పడివుండి ఆయనముందు చెయ్యి జాచేకంటె బావమరిది దగ్గర డబ్బయింది తీసుకోటమే ఎక్కువ అనుకూలంగా వుందని పించింది—అందులోనూ తన ప్రమేయం ఏమీవుండదు— అదంతా వాళ్లమ్మాయే చూసుకుంటుంది—తన పని అల్లా అది ఉంచుకుని ఖర్చుపెట్టుకోవటమే'అనిపించి.

'సరేనాయి' అన్నాడు.

అతను అనుకున్నట్లుగానే వారం తిరిగేసరికి డబ్బు చేతిలో పడింది.

**(ఇంకా వుంది)**

# వారఫలం

**3-10-1969 శుక్రవారం మొదలు 9-10-1969 గురువారం వరకు**

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. పాలివారితో గౌరవం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వల్ల జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం.** అధికవ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**సింహం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారంమధ్యలో అధికవ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సజ్జన సాంగత్యం లభించగలదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసంతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—విలాస వస్తువులు కొంటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**వృశ్చికం:** కొన్ని వ్యవహారాల్లో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మకరం** వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకు యేర్పడతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో ఆందోళన కలుగుతుంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:** మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సాంఘిక కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

**మీనం:** ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాంఘిక కార్యక్రమాలలో మార్పులు వస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్

మంచి శిక్షే సత్యం...'

సత్యం కొంచెమాగి అన్నాడు-

'మీరు మీ నాన్నగారికి నా పేరు ఎందుకు చెప్పలేదు?'

ఆమాటవిన్న స్వరాజ్యం అంత విచారం లోనూ చాలా క్రూరంగా—ఆ పిల్ల తండ్రి లాగా—నవ్వేసి అన్నది.

'నాకు తెలుసు సత్యం. నాన్న చెప్పిందే నిజం. పేదవాడికి ఆశ ఎక్కువ. నేను నిజం చెబితే—నువ్వీయింట్లో నాన్నపక్కన రాచమర్యాదలు పొందాలని ముచ్చట పడు తున్నావుగదూ? స్కౌండ్రల్...నీ నాటకం యిప్పుడిప్పుడే అర్థమవుతోంది.'

స్వరాజ్యం మాటలకి సత్యం బాధ పడ్డాడు. అభిమానం తన్నుకురాగా అత నన్నాడు—

'తొందర పడటం నీ లక్షణమేమో స్వరాజ్యం. చాలా అన్యాయంగా మాటాడే సేవ్. దేవుడిచ్చిన బుద్ధిని చదువుకుపయో గించి, రేపు నేనూ పెద్దవాడినై నా వాళ్లని ఉద్ధరించాలని యిక్కడికొచ్చేను. అంతే గాని, వంచనతో నిన్ను పొంది—నీద్వారా ఈ మేడా, ఈ సిరి మింగాలని కాదు తెలుసా?'

స్వరాజ్యం మళ్లా ఏడుపు ప్రారంభిం చింది. గోడవారగా కూర్చుండి పోయింది.

'వెళ్లిపో సత్యం. ఇంక నువ్వెళ్లిపో... నీకే ఆపద రాకుండా నేను చూచుకుంటాను గాని దయచేసి ఈ యింటినుంచి వెళ్లిపో... ఎందుకైతేనేం...నీపేరు దాచేను. నీకు నామీద జాలివుంటె మన పాడు కథని దాచు. అంతే... ఇంతకంటే నన్నేమీ అడక్కు. వెళ్లిపో ప్లీజ్.'

సత్యం అక్కడ్నుంచి వొచ్చేసేడు. మరునటిరోజా తిన్నగా పల్లెటూరు చేరు కున్నాడు. కొడుకుని చూచిన నారాయణ ఏదో కీడు శంకించేడు. ఎందుకొచ్చేసేవని అడిగేడు. ఏం జరిగిందో చెప్పమన్నాడు. ఆ తండ్రి ఎన్నెన్ని అడిగినా అతను జరిగి పోయిన ఘోరాన్ని చెప్పలేకపోయేడు.

అయితే ఆ రహస్యం దాగలేదు. నారాయణ స్వయంగా బస్తీకి వెళ్లివచ్చేడు. వచ్చి, ఇంట్లో అరిచేడు. కేవలం కొడుకు దొంగైనందుకు అరిచేడే తప్పించి, స్వరాజ్యంతో కొడుక్కున్న అక్రమసంబంధం పిచ్చి తండ్రికి తెలిసివుండదనే విశేషానికి

# శరశ్చంద్రిక

(39-వ పేజీ తరువాయి)

సత్యం ఆశ్చర్యపోయేడు. ఈ కొత్త కథ ఆ యింట్లో ఎవరు చెప్పివుంటారోగాని నీచంలో వాళ్లది పైచేయి! ఈకథ నాకటి అడ్డంపెట్టుకుని దొరకబోయే పరుడి కళ్లల్లో దుమ్ముకొట్టే వాళ్ల పథకానికి సత్యం చేత్తులెత్తేడు.

బసవపున్నయ్యగారు ఒక ఆశల మనిషిని వలేసి తెచ్చేడు. ఆ మనిషి కోరిన కట్నం మిచ్చి స్వరాజ్యంతో అతనికి పెళ్లి చేసేడు. ఆ పైన—పరపతి నుపయోగించి అల్లుడ్ని అమెరికా పంపేడు.

అక్కడే కన్నది స్వరాజ్యం శరశ్చంద్రికను.

—దూరంగా రైలుకూత వినిపించింది. పెద్దల్లో సంచలనం కలిగి అది ఉత్సాహం కింద మారిపోయింది. వాళ్లందరూ ప్లాట్ ఫారమ్ అంచుకి చేరేరు.

సత్యం ఓపిక తెచ్చుకుని లేచి నించు న్నాడేగాని, మళ్లా అంతలోనే బల్లమీద కూచోపెట్టింది అతని అనారోగ్యం. అతని శరీరంలో ఓపిక సన్నగిల్లుతోంది. అతని హృదయంలో ఆరాటం అధికమవుతోంది.

నాలుగేళ్లనుంచీ చూడాలనుకుంటూన్న శ ర శ్చం ద్రి క ఇవాళే ఉదయిస్తోంది. ఎక్కడో దేశంగాని దేశంలో పుట్టిపెరిగిన తన ప్రాణం ఇవాళ్టికి దర్శన మివ్వ బోతోంది. ఆనందలక్ష్మిలో అతని రూపు చూచుకుని దుఃఖించని రోజు లేదు. శరశ్చంద్రికలో అతన్ని చూచుకోవాలనే కోరిక పెరగని క్షణం లేదు.

రైలు ప్లాట్‌ఫారమ్మీదికొచ్చి ఆగింది. ఎక్కడ ఏ పరువుల పెట్టెలో వుందో శరశ్చంద్రిక!

ఏ దేవుడు అనుగ్రహించేడో — లేక సాక్షాత్తు శరశ్చంద్రికే కోరుకున్నదో— లేచి నించోగలిగేడు సత్యం. నించుని వేగంగా నడిచేడు గూడాను. ఒక స్తంభాన్ని ఆనుకుని నిలబడ్డాడతను. ఆ మరుక్షణం లోనే అతని కళ్లు మెరిసేయి.

బసవపున్నయ్యగారి చేతుల్లో కళ్లింతవి చేసుకుని విస్తుపోతూ చూస్తోంది పాప. బంగారు బొమ్మే! ఆ పాప చుట్టూతా జనం ఎక్కడివాళ్లక్కడ ఆగిపోయి కళ్ల ప్పగించి పాపని చూస్తున్నారు.

కాని—

పాప చూపు కొంచెం దూరంగా వున్న సత్యంవేపు ప్రసరించి అతనిమీదనే చిత్రంగా ఆగిపోయింది. ఎందుకో పాప వెన్నెల్లా చల్లగా నవ్వేసింది. సత్యం కళ్లు పండుగ చేసుకున్నాయి.

'అదిగో పాప...నా పాప...శరశ్చంద్రిక. పాపా, నేనొచ్చేసేను. నీ తండ్రిని నేనొచ్చే సేను. జెంటిల్మెన్...మహాజనులూ...నేనెం విలువలేనివాడినిగాను. నా నెత్తురు విలు వైనది. నా పాపని చూడండి. ఇక్కడీ ప్లాట్‌ఫామ్మీద వెలుగుతూన్న ఈ దీపాల్ని చూచి, ఈ దీపాల్నిమించే ఆ దీపాన్ని చూచి ఆనందించండి ... పాపా, నిన్నెత్తు కున్న నీ తాత చేతులు మంచివి కావు. నీకు తండ్రినని చెప్పుకుంటూన్న ఆ అమెరికా బాబు దొంగబాబు. నీ తాత జాతివాడు. నిన్ను కన్నతల్లి చరిత్ర మంచిదికాదు. ఇందరి కాకులమధ్య పెరగబోయే పాపా, నువ్వు నీ తల్లిలాగా బ్రతక్కు. నీ తాత లాగా, అమెరికాబాబులాగా, మీ అమ్మలాగా —వీళ్లందర్నీ మింగిన అవినీతిలాగా నువ్వు అసహ్యంగా ప్రవర్తించకు. దేవుడనే వాడుంటే నిన్ను శరశ్చంద్రికనే చేయాలి. నీ పేరులో పేరడి ప్రసక్తిని రానివ్వవే రానివ్వడు. వర్ధిల్లు పాపా, వందేళ్లు శరశ్చంద్రికవై వర్ధిల్లు చిట్టీ...'

సత్యం పాపని మనసులో దీవించిన మరుక్షణమే మళ్లా అతన్ని, అతను పోషించుకుంటూన్న అనారోగ్యం ఆవరిం చింది. అతను నేలమీదికి వొరిగిపోతున్న ప్పుడు—అప్పుడు మాత్రం — తృప్తిగానే ఒరిగిపోయేడు.

అందరూ అతన్ని దాటివెళ్లేరు.

స్వరాజ్యం దాటుతూ దాటుతూ అతన్ని చూడగలిగింది. అతనూ ఆమెను స్పష్టంగా చూసేడు. ఆ యిద్దరి చూపులూ కలిసిన చోట...

ఒక ఖరీదైన గదీ, ఆ గదిలో ఒకపంకా, అందమైన మంచం, ఎలిజబెత్ టైలరూ, రిచర్డ్ బర్టనూ...మాసిపోయిన పక్క బట్టలూ...పాప భవిష్యమైన ఉద్రే కమూ...చివర్లో వెన్నెలరేఖా సత్యాకి కనుపించి...క్షణంలోనే మళ్లా కనుపిం చడం మానుకున్నాయి! ●




నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుందని సామెత. ఎంత నిజం కదూ? కొందరికి ఎవరూ మంచివాళ్లు కానట్టే కొందరికి అందరూ మంచివాళ్లలాగా కన్పిస్తారు. రెండురకాల్లోనూ కూడా అతిగా పోతే ఇబ్బంది తప్పదు. స్నేహంపేరిట ఇరుగు పొరుగులని దోచేవారుంటే; మొహమాటం పేరిట ఇరుగుపొరుగుల కేసి తిరిగి చూడనివారూ ఉంటారు.

ఇల్లూ సంసారం అన్నాక అదీ నలుగురి మధ్య ఉన్నాక బ్రతకడం నేర్పులేకపోతే ఇబ్బందులు తప్పవు. ఈ నేర్పులో ఆడవాళ్లకీ మొగవాళ్లకీ తేడా ఉంటుంది. అసలు ఈ ఇంటి పురుషుడూ ఆ యింటి పురుషుడూ ముఖపరిచయమేనా లేనట్లుంటే ఆడవాళ్లు మటుకు అక్కగారూ, ఒదినగారూ అంటూ ఎంతో ఉప్పాయంగా కలిసిమెలిసి ఉంటారు. అదే మగవాళ్ల స్నేహం (ఏ పేకాటకోసమో, ఒకే ఆఫీసు అయితే స్కూటరు రైడుకోసమో) అయితే ఆడవాళ్లు అంటీ ముట్టనట్టు ఉంటూ ఉంటారు. (ఏదైనా మాటామాటా వస్తే మటుకు రోజూ సొంతబండికోసంలాగా నా వారి స్కూటరుకోసం ఎదురు చూస్తాడు వీరాయన అనో, పేకాట నేర్పి నా కొంపకి చిచ్చుపెట్టాడనో దెప్పుకుంటారు! అది వేరే సంగతి)

అలా ఉండడం కూడా నేర్పరితనం కాదు. పిల్లలు కల తల్లులైతే పక్కింటి పిన్నిగారి అవసరం కావాలా? లేకుంటే జల్సాగా ఉంటూ కనీసం పలకరించడానికి కూడా పొరుగువారు ఉగరా? అలా అయితే ఎలా? నా స్నేహితురాలొకతె ఉంది. నల్గురు సంతానం (బర్త్ కంట్రోలంటె నమ్మకం లేదుట!) కింద వారితో ఎంతో చనువుగా ఉంటుంది. వారికీ ఇద్దరు పిల్లలు.



'ఇన్నాళ్లనుంచి ఉంటున్నాం గా? చేబదుళ్లనీ, వాయిదుళ్లనీ చేసుకోలేదు. ఎప్పుడూ అధికంగా మాట్లాడుకోం. అయినా ఎప్పుడూ దెబ్బలాడుకోలేదు. నేనూ వారూ ఎక్కడికేనా వెళ్లాలంటే మిసెస్‌రావు పిల్లల్ని కూర్చోపెట్టుకుంటుంది. ఆవిడ వెళితే వాళ్ల పిల్లలు నాదగ్గర ఉంటారు. అందరం కలిసి వెడితే ఖర్చులు షేరు చేస్తాం. ఈ ఎరేంజిమెంటు ఎంతో హాయిగా ఉంది. మొహమాటాలు పోవు. అలా అని స్నేహం లేకుండానూ ఉండదు' అంది నా ఫ్రెండ్. నిజమైన నేర్పరి! అనిపించింది.

స్నేహం చేశాక కూడా మనపై వారికి గౌరవం నిలవాలంటే కొన్ని కనీసపు సూత్రాలని పాటించాలి. అవి ఎవరికివారు ఏర్పరచుకుని ఎవరూ రిఫరీ లేకపోయినా జాగ్రత్తగా రూల్సులాగా అనుసరించాలి.

స్నేహం చేసినంత మాత్రాన మన కుటుంబపు లొసుగులన్నీ దండోరా వేయ్య నక్కరలేదు. కర్మంచాలక తేడాలు వచ్చినప్పుడు మనం చెప్పుకున్న విషయాలె మనని లోకువ చేయడానికి వాడతారు. స్నేహంలో హెచ్చుతగ్గులు లేవు కులమత భేదాలులేవు. కాని తగినవి తగనివి అంటూ ఉంటాయి. తగని స్నేహాలు చేసి అందరికీ అలా స్నేహం ఎందుకుచేశామో వివరిస్తూ కాలక్షేపం చేసేకంటే — వదులుకోవడం మంచిది. ఇరుగు పొరుగులు మనకంతగా నచ్చనివారైతే ముభావంగా ఉండడంలో తప్పు లేదుగాని ముఖం చిట్లించుకోవడం చేతకానితనం. పూసుకుని తిరగకపోయినా ముఖాముఖీ ఎదురైతే చిరునవ్వు నవ్వి తప్పించుకోవడం ఒక కళగా అలవాటు చేసుకోవాలి.

స్నేహితులు మనని లోకువచేసే అవకాశం యివ్వడం తప్పు. అలాంటి లోపాలుంటే మనం చెప్పుకోవడం అంతకన్నా తప్పు.



# అనోలియమ్

## కోల్డ్ రబ్

**జలుబులనీ, దగ్గులనీ నివారించే**
**మరొక అమోఘమైన శక్తి.**

జలుబు చేస్తే రొమ్ములో కఫం చేరుకుంటుంది.
గొంతుక, ముక్కు పూడుకుపోతాయి.
అనోలియమ్ బాగా లోతుకి చొచ్చుకుపోయి గుణం
ఇవ్వగలదు. అది శక్తివంతమయిన ఔషధాలుకల
అనోలియమ్ జలుబు, దగ్గు, రొంపభారం—వీటిని
చప్పున, చల్లగా తగ్గిస్తుంది.
ముక్కు, గొంతుక, రొమ్ము—వీటిమీదా, వీటిచుట్టూ
అనోలియమ్ మర్దన చెయ్యండి,
బాధమటుమాయమవుతుంది.
అనోలియమ్ వెలకూడా సరసమయినదే!




(ఇది అమృతాంజన్ లిమిటెడ్‌వారి
తయారింపే అని గుర్తుంచుకోండి

FDSAMI 235TEA

## టిట్ బిట్స్ నెం. 56 – 18 క్లూలు

1. గాంధీజీ మూలంగా: కర్మయోగి/దయామయుడు.
2. గాంధీజీ తనకు అతి ప్రియం / అలంకృతం కాని ఏ వస్తువునూ అంటలేదు.
3. గాంధి తన లేఖనములను అస్పష్ట రూపంలో ఎంతమాత్రమూ ఉంచి యుండక పోయినప్పటికీ ఆయన వ్యక్తిత్వమును స్పష్ట / వర్గీకృత పరచుట మరియు ఆయన ఆలోచనను వర్గీకరణ మొనర్చుట నిజంగా ఒక సమస్యయే.
4. తన అన్ని భంగముల / అనుచరకుల అందరి సంపూర్ణ బాధ్యతను గాంధీజీయే వహించెనను యదార్థమునకు ఇతిహాసం సాక్షియై వున్నది.
5. ఇటీవలి ఇతిహాసమందలి గొప్ప వ్యక్తులందరిలో మహాత్మా గాంధి అందరికంటె ఎక్కువ ఉదార / భద్రమైన మరియు పరిత్యాగి, యోగి మరియు జన సేవక సమన్వయ వ్యక్తి.
6. గాంధీజీయొక్క మనస్సు / వినోదంపూర్తిగా మాయా లక్షణ రహితమైన బాలుని నిష్కళంక అధిక్యతను గలిగి యుండెను.
7. నిజంగా మహాత్ముని అనేక మనోహర విశేషతలలో ఆయన వినమ్రత / వినోద పూర్వక బోధ ఒకటియై వుండెను.
8. ఆయన బద్ధకంకణుడై పేటి నిమిత్తం నిలిచాడో ఆయా ఆదర్శము / భావనలను స్వీకరించకుండా అనేకమంది గాంధీజీ యొక్క రాజనీతిక నాయకత్వమును అంగీకరించిరి.
9. మహాత్మా గాంధిని రష్యాలో ఇప్పుడు ప్రతిక్రియావాదిగ గణింపబడుట లేదు, కాని మానవ జాతికి గొప్ప నాయకుల / ముక్తి దాతలలో వొకడుగా పరిగణింప బడ్డాడు.
10. గాంధి వినీతుడు, వినమ్రుడు, సమాధాన ప్రియుడై యుండెను, కాని వ్యక్తియొక్క నైతిక/రాజనీతిక హక్కుపై ముట్టడిని సహింపజాలక పోయేవాడు.
11. నిస్సందేహంగా, గాంధి క్షుద్బాధా పీడిత జనుల బాధలను తొలగించే రామబాణ ఔషధం/ప్రబలేచ్ఛ గలిగి యుండెను.
12. మహాత్మాగాంధి స్వాతంత్ర్య సమర నాయకత్వమును వహించినప్పుడు ఏమి సంభవించింది? పార్టీ/దర్శన, నీతి, తంత్రం మరియు కార్యక్రమాలు పూర్తిగా మారినవి.
13. శాంతి / పూర్ణత అనేకమందికి ఇంకా ఇప్పటికీ ఆదర్శవాదియొక్క స్వప్నంగా కనిపిస్తున్నది. మహాత్మా గాంధికి ఆ స్వప్నమే యదార్థవాది యొక్క ఆవశ్యకతగా మారిపోయింది.
14. గాంధియొక్క దర్శనం అస్తిత్వంయొక్క శుద్ధతా / ఏకతాయొక్క ధరణపై నాధారపడియున్నది.
15. గాంధీజీ శోధికుడు/సిద్ధుడు అయివుండెను.
16. గాంధి కేవలం అహింసా సత్యాగ్రహానికి స్మారక చిహ్నం ఇంకేమాత్రం కాదు, ఆయన జీవనానికి నవదృష్టి / పద్ధతికి సబల క్రాంతికారి ప్రేరకుడై యుండెను
17. గాంధి మానవ సంకల్ప / జ్ఞానమునకు సాకారరూపమై యున్నాడు.
18. గాంధి సర్వదా తన విరోధికి జయించే/వెనక్కు తగ్గే ప్రతి ... నవీయ అవకాశాన్ని కలిగించేవాడు.

## No. 56: 18 CLUES

(1) Gandhiji was primarily a man of Action / Compassion.
(2) Gandhiji touched nothing which he did not Adore / Adorn.
(3) Though Gandhiji was the last person to make any of his writings ambiguous, it is indeed a problem to Clarity / Classify his personality and categorise his thought.
(4) History bears witness to the fact that Gandhiji took the entire responsibility for all his Failures / Followers.
(5) Of all the great figures in recent history, Mahatma Gandhi may reasonably be supposed to have been the most Generous / Gentle and self-denying, a perfect blending of the saint and the public servant.
(6) Gandhiji's Heart / Humour had the untainted exuberance of a child, completely devoid of any snobbish trait.
(7) Indeed, among the many fascinating qualities of the Mahatma was his inimitable sense of Humility / Humour.
(8) Many accepted Gandhi's political leadership without at the same time accepting the Ideals / Ideas and values for which he stood
(9) Mahatma Gandhi is no longer regarded in the USSR as a reactionary, but as one of the great Leaders / Liberators of mankind.
(10) Gandhi was meek, humble and compromising but he could not tolerate any attack on the Moral / Political right of man.
(11) Undoubtedly, Gandhi had the Panacea / Passion for ameliorating the sufferings of the starving masses.
(12) What happend when Mahatma Gandhi took over the leadership of the freedom struggle? There was a complete overhauling of Party / Philosophy, policy, technique and programme.
(13) Peace / Perfection to many may still appear to be the dream of an idealist. To Mahatma Gandhi it is this dream translated into the necessity of the realist.
(14) The philosophy of Gandhi is based on the concept of the Sanctity / Unity of existence.
(15) Gandhi was a Seeker / Seer.
(16) Gandhi is no longer a symbol of mere passive resistance, he is a dynamic and revolutionary urge for a new Vision / Way of life.
(17) Gandhi is human Will / Wisdom personified.
(18) Gandhi always offered every possible opportunity to his adversary to Win / Withdraw.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిటిల్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

# బ్రతక నేర్పు

'మన పక్కింటి కవిగారు పెళ్లాన్ని కొడుతారుట మామయ్యా, ఆశ్చర్యంగా లేదు! ప్రేయసీ, వెన్నెలా అంటూ పద్యాలు రాస్తాడుకదా.' అన్నాను మామయ్యతో — నే విన్నసంగతి ఓ పట్టాన నమ్మలేక 'ఎలా తెలిసింది?' నవ్వుతూ అడిగాడు మామయ్య. 'అవిడగారు అతి రహస్యంగా




అత్తయ్యతో చెప్తాంది'—'మీ అత్తయ్యమ పిలు' అన్నాడు వచ్చిందావిడ. 'ఏమిటే కవిగారి పెళ్లాంతో కబుర్లు?' సరదాగా అడిగాడు. 'ఏంలేదండీ, సాయంత్రం మనింటికి వచ్చే పూలవాణ్ని నాళ్ళింటికి పంపమంది' అంది నవ్వుతూ అత్తయ్య. నేను తెల్లబోయాను...అత్తయ్యది బ్రతకనేర్పు — ఓ పట్టాన పైకి తేలదు— ఘటికురాలు!

---

## అవీ-ఇవీ...

శ్రీ ఫ్రాన్జ్ జోసెఫ్ నొవాక్ 25 ఏళ్ల జర్మన్ యువకుడు. ఆయనకి చరిత్ర, సంస్కృతి, మత సంబంధమైన విషయాలందు మన దేశమందు జరుగుతున్న అధునిక అభివృద్ధిని గురించి తెలుసుకోవాలన్న ఉత్సాహం ఉంది. ఈయన జర్మన్‌తో పాటుగా ఇంగ్లీషు, స్పానిష్ భాషలతో కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపగలరు. శ్రీ ఫ్రాన్జ్ జోసెఫ్ నోవాక్‌తో కలం స్నేహం చేయు ఉత్సాహం కలవారు క్రింది చిరునామాకి రాయవచ్చు.


ఫ్రాన్జ్ జోసెఫ్ నోవాక్,
75 కారల్స్‌రుహి 21,
హైన్‌గార్‌టెన్‌వెగ్ 9,
టెస్టు ఫాక్ 210723,
జర్మనీ.

# లిట్‌క్విజ్ గాంధీ శతజయంతి జరుపుతున్నది

LitQuiz No. 56
Rs. 65,000
1ST Rs. 30,000
2ND Rs. 10,000
UP TO 4 ERRORS Rs. 9,000
MiNiQuiZ 1st.—Rs. 13,000 2nd—Rs. 3000
TRUTH IS GOD

## గొప్పది మరియు సులభమైనది

రొఖ్ఖ రశీదులకు మరియు ఎక్కువ ఎంట్రీ ఫారములకు:— Eskay Enterprises, C/o. G. V. S. SAIKUMAR, 4-1-213, హనుమాన్ టెక్డీ, హైదరాబాద్.

నెం. 54: నెం. 54 లో ఆల్ కరెక్టు ఎంట్రీ రాలేదు. ఒక తప్పుతో పంపిన 6 మంది విజేతలు ఒక్కొక్కరు రూ. 4667 లు గెలుపొందిరి. రెండు తప్పులతో పంపిన 37 మంది విజేతలు ఒక్కొక్కరు రూ. 270లు గెలుపొందిరి. మిని క్విజ్‌లో 16 మంది విజేతలు ఒక్కొక్కరు రూ. 625 పొందిరి.

### లిట్‌క్విజ్ నెం. 56 అధికార ఎంట్రీ ఫారము

బహుమతుల మొత్తం రు. 65,000. ఆఖరు ముగింపు తేదీ 15-10-69 బుధవారం

ADDRESS: LITQUIZ No 56, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

గమనిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 56, బొంబాయి—7 వారికి చెల్లించునటు ఉండవలెను.

| 1 | | Re. 1 |
|---|---|---|
| 1 | ACTION | COMPASSION |
| 2 | ADORE | ADORN |
| 3 | CLARIFY | CLASSIFY |
| 4 | FAILURES | FOLLOWERS |
| 5 | GENEROUS | GENTLE |
| 6 | HEART | HUMOUR |
| 7 | HUMILITY | HUMOUR |
| 8 | IDEALS | IDEAS |
| 9 | LEADERS | LIBERATORS |
| 10 | MORAL | POLITICAL |
| 11 | PANACEA | PASSION |
| 12 | PARTY | PHILOSOPHY |
| 13 | PEACE | PERFECTION |
| 14 | SANCTITY | UNITY |
| 15 | SEEKER | SEER |
| 16 | VISION | WAY |
| 17 | WILL | WISDOM |
| 18 | WIN | WITHDRAW |

| 2 | | Re. 1 |
|---|---|---|
| 1 | ACTION | COMPASSION |
| 2 | ADORE | ADORN |
| 3 | CLARIFY | CLASSIFY |
| 4 | FAILURES | FOLLOWERS |
| 5 | GENEROUS | GENTLE |
| 6 | HEART | HUMOUR |
| 7 | HUMILITY | HUMOUR |
| 8 | IDEALS | IDEAS |
| 9 | LEADERS | LIBERATORS |
| 10 | MORAL | POLITICAL |
| 11 | PANACEA | PASSION |
| 12 | PARTY | PHILOSOPHY |
| 13 | PEACE | PERFECTION |
| 14 | SANCTITY | UNITY |
| 15 | SEEKER | SEER |
| 16 | VISION | WAY |
| 17 | WILL | WISDOM |
| 18 | WIN | WITHDRAW |

| 3 | | Re. 1 |
|---|---|---|
| 1 | ACTION | COMPASSION |
| 2 | ADORE | ADORN |
| 3 | CLARIFY | CLASSIFY |
| 4 | FAILURES | FOLLOWERS |
| 5 | GENEROUS | GENTLE |
| 6 | HEART | HUMOUR |
| 7 | HUMILITY | HUMOUR |
| 8 | IDEALS | IDEAS |
| 9 | LEADERS | LIBERATORS |
| 10 | MORAL | POLITICAL |
| 11 | PANACEA | PASSION |
| 12 | PARTY | PHILOSOPHY |
| 13 | PEACE | PERFECTION |
| 14 | SANCTITY | UNITY |
| 15 | SEEKER | SEER |
| 16 | VISION | WAY |
| 17 | WILL | WISDOM |
| 18 | WIN | WITHDRAW |

| 4 | | Re. 1 |
|---|---|---|
| 1 | ACTION | COMPASSION |
| 2 | ADORE | ADORN |
| 3 | CLARIFY | CLASSIFY |
| 4 | FAILURES | FOLLOWERS |
| 5 | GENEROUS | GENTLE |
| 6 | HEART | HUMOUR |
| 7 | HUMILITY | HUMOUR |
| 8 | IDEALS | IDEAS |
| 9 | LEADERS | LIBERATORS |
| 10 | MORAL | POLITICAL |
| 11 | PANACEA | PASSION |
| 12 | PARTY | PHILOSOPHY |
| 13 | PEACE | PERFECTION |
| 14 | SANCTITY | UNITY |
| 15 | SEEKER | SEER |
| 16 | VISION | WAY |
| 17 | WILL | WISDOM. |
| 18 | WIN | WITHDRAW |

56 — FREE AFTER 4 COUPONS — MiNiQuiZ

| | | | |
|---|---|---|---|
| ACTION | COMPASSION | SEEKER | SEER |
| ADORE | ADORN | VISION | WAY |
| CLARIFY | CLASSIFY | WILL | WISDOM |
| FAILURES | FOLLOWERS | WIN | WITHDRAW |

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/—M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.............

56 (ASVP)

CAPITAL LETTERS

NAME.............................................

.............................................

ADDRESS .............................................

.............................................

.............................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

ఆఖరు ముగింపు తేదీ: 15—10—69
సొల్యూషన్ ఆంధ్రప్రభ: 19—10—69
* సొల్యూషన్ నెంబరు పొందుటకు 10 పైసల స్టాంపు, వ్యక్తిగత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను.



'బుద్ధిమంతుడు'లో నాగేశ్వరరావు, విజయనిర్మల

**చిత్రసమీక్ష :**

# 'బుద్ధిమంతుడు'

'గాలిలో దీపంపెట్టి దేవుడా నీ మహాత్యం!' అన్నాడట. దీపం ఆరిపోకుండావుంటే దేవుడికి మహాత్యం వున్నట్టూ లేకపోతే లేనట్టూ! దీప మారిపోతే దేవుడే లేడనే తెగ మనజాతిలో లేకపోలేదు. అటువంటివారికి కనువిప్పుగా — మానవసేవలో గుట్టుగా వున్న మాధవసేవని ప్రజలకి తేటతెల్లంగా, సోదాహరణంగా వివరించి చూపించాడు చిత్రకర్తనావారి 'బుద్ధిమంతుడు'

చిత్రం చూస్తున్నప్పుడు ఇది చలన చిత్రంగా అనిపించదు. మన నిత్యజీవితంలో అడుగడుగునా ఎదుర్కొనే సమస్యలకి ఒక సమాధాన కావ్యంలా కనిపిస్తుంది. కథా సృష్టిలో సమ్మోహనీకత — గ్రామీణ జీవితాన్ని, అక్కడ ప్రజల స్థితిగతుల్ని సహజ సౌందర్యంతో ప్రతిబింబింపజేసింది.

ప్రేక్షకులు కథతో కలిసిపోయినా, పాత్రలతో లీనమైపోయినా — అదీ కథ పూర్తిగా అల్లుకుపోయిన నాగేశ్వరరావు ప్రతిభ. ఏ రాకెట్ అవసరమూ లేకుండా కంద్రుడి దగ్గరికి ఎగిరెళ్ళిపోదామనుకున్న చలాకీ నాగేశ్వరరావుకీ, విప్రనారాయణ కాలంనాటి బుద్ధిమంతుడయిన నాగేశ్వరరావుకీ పోటాపోటీలు పెడుతూ విజయం సాధించారు నిర్మాతలు.

ఈ విజయానికి సారథులు అందాల 'బొమ్మల' బాపు, రమణీయ 'కథల' ముళ్ళపూడి వెంకటరమణ బుద్ధిమంతుడు చిత్రాని కొకరు దర్శకుడు, మరొకరు రచయితా. కళ్ళెంలేని కథ పూహోవేగంతో పరుగెడితే, దారిని సుగమంచేస్తూ మనోహరంగా దిద్ది తీర్చారు దర్శకుడు. 'టేస్ట్ సెంటూ' 'స్క్రీన్ మెరిటూ' పుష్కలంగావున్న 'బుద్ధిమంతుడు' మన చిత్రరంగాన్ని మరమత్తు చెయ్యగలిగినంతటి బుద్ధిమంతుడు! సాహిత్యంలోను, చిత్రీకరణలోను అసభ్యతకి అశ్లీలానికి దూరంగా—సకలజన మనోరంజకంగావుండి, నిజంగా 'బుద్ధిమంతుడ' నిపించుకున్న చిత్రమిది.

మాధవుడు తప్ప అన్య మెరుగని ఒక అన్నకీ, మానవులు తప్ప అనే అతని తమ్ముడికీ, వారిద్దరి ఆదర్శాలతోనూ చెలగాటమాడే ఒక గ్రామ పెద్దకీ మధ్య జరిగే ట్రయాంగ్యులర్ సంఘర్షణ ఈ చిత్రం. మాధవుడి అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని, పక్కలో బల్లెంగా వుండి 'గుమ్మడికాయ మీద వాటేస్తున్న' అతని తమ్ముడి పీడ విరగడి చేసుకుందామని కథ క్లైమాక్సు వరకూ కష్టపడతాడు గ్రామ పెద్ద. దేవుడి మహిమకీ మనిషి విలువకీ పరీక్ష పెట్టించిన క్లైమాక్సులో అతని పాపం బద్దలై 'దాసోహం' అంటాడు.

దేవుడిపై భారం వేసిన క్లైమాక్సు క్లైమాక్సుగా తీసుకుంటే గుండెలు బేజారెత్తించే క్లైమాక్సు!

టెక్నికల్‌గా తెలుగు చిత్రరంగం చాలా అభివృద్ధిని సాధించింది అనడానికి ఇద్దరితో కెమెరావర్కు ఒక మంచి ఉదాహరణ. యస్. వెంకటరత్నం సామర్థ్యం నాగేశ్వరరావు ద్విపాత్రాభినయాన్ని రసవంతం చేసింది. ఇదొక చూడతగ్గ అంశం!

పాత్ర పోషణలో నాగేశ్వరరావు అశేష ప్రజ్ఞ కనబరిచారు. రెండువిధాల విభిన్న పాత్రలలోని నాగేశ్వరరావు నటన పాత్రలని విందుగా, కథని సజీవంగా వుంచగలిగింది. పాత్ర చిన్నదయినా, విజయనిర్మల కథానాయికగా వున్నంతలో చక్కగా నటించింది. గ్రామ పెద్దగా నాగభూషణం అర్థవంతంగా నటించారు. ఈ పాత్ర ఒక విశేషాకర్షణ. ఇతర ముఖ్యపాత్రలని శోభన్‌బాబు, సూర్యకాంతం, శాంతకుమారి, కృష్ణంరాజు, సంధ్యారాణి, అల్లురామలింగయ్య మొదలైనవారు పోషించి చిత్రానికి శోభ కూర్చారు.

కె. వి. మహాదేవన్ సంగీతం చిత్రాన్ని గ్రామీణ వాతావరణంలో ముంచి వీనుల విందు చేసింది.

యువదర్శకుడు బాపు కృషికి ఉజ్వల భవిష్యత్తు నేర్పరుస్తూ— ఆబాలగోపాలాన్నీ రంజింప చెయ్యగల 'బుద్ధిమంతుడు' చిత్రానికి నిర్మాత యస్. యస్. మూర్తి.

—సితరాజా

# సుదర్శన్ ద్వారా పొదుపు చేసుకోండి




## ఇండియా మొత్తంలోకెల్లా పెద్ద చిట్‌ఫండ్ సంస్థ



## సుదర్శన్ చిట్ ఫండ్

యూనిట్ అఫ్

సుదర్శన్ ట్రేడింగ్ కంపెనీ లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీసు, కోజికోడ్-2

సెంట్రల్ ఆఫీసు: సుదర్శన్ బిల్డింగ్

వైట్స్ రోడ్, మదరాసు-14

# సినిమా

అక్కాచెల్లెళ్ల సౌభ్రాతృరాగం, ఒకరి కొకరు కోసం చేసే త్యాగం కథాంశంగా గొన్న జగపతి ఫిలింస్ వారి పిరిగొల్లుకొన్నైన సాంఘిక చిత్రంయొక్క షూటింగు దాదాపు పూర్తయింది. శ్రీ అక్కినేని సంజీవి దర్శకత్వంలో పన్నెండు రీళ్ల చిత్రం తయారైంది. ఒక వానపాట ఒక కొంటెటి త్రిపాట, ఒక నేపథ్యపుపాట, కృష్ణ విజయ నిర్మలగార్ల యుగళగీతం, నాగేశ్వరరావు విజయలలితగార్ల నృత్య సమ్మిళితమయిన పాటద్వయం చిత్రీకరించబడింది. శ్రీ వి. కృష్ణప్రసాద్ నిర్మిస్తున్న 'అక్కాచెల్లెలు' చిత్రంలోని ముఖ్య పాత్రలను నాగేశ్వరరావు, కృష్ణ, గుమ్మడి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, నాగయ్య, 'షావుకారు' జానకి, విజయ నిర్మల, శాంతకుమారి, సూర్యకాంతం, రమాప్రభ, విజయలలిత, రాజబాబు ధరిస్తున్నారు ఈ చిత్రానికి కె. వి. మహాదేవ్ సంగీతాన్ని, ఎస్. వెంకటరత్నం ఛాయను, ఆత్రేయ మాటలను, టి. వి. సుబ్బారావు కళను, చౌదరి మేకప్‌ను, చిన్నిసంపత్ నృత్యాన్ని నిర్వహిస్తున్న ఈ చిత్రం లక్ష్మీఫిలింస్‌ద్వారా విడుదలౌతుంది.

* * *

సినిమా రచన ఎలా వుండాలి, కథా ట్రీట్‌మెంటు ఎలా చెయ్యాలి. రంగ విభజనను ఎలా సరిపెట్టాలి అనేది ప్రధానాంశాలపై విజయవాడలోని 'మనోరమా' హోటల్‌లో శ్రీ ఫిలింస్‌వారు ఒక సమావేశాన్ని యేర్పాటుచేశారు ఈ గోష్ఠిలో దర్శకుడు శ్రీ వి. రామచంద్రరావు, చిత్ర నిర్మాత శ్రీ డి. బి. నారాయణ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. విజయవాడ రచయితలకు శిక్షణనిచ్చే 'వర్క్‌షాపు'ను ఫిలిం ప్రెస్ క్లబ్‌వారు నిర్వహిస్తే బాగుంటుందని నవయుగాఫిలింస్ మేనేజరు శ్రీ కాట్రగడ్డ నరసయ్య సూచించారు. వర్క్‌షాపు నిర్వహణకు శ్రీ శంకరయ్య, శ్రీ విరాజీ అంగీకరించారు.

శ్రీ రామచంద్రరావు ప్రసంగిస్తూ కొత్తరకం కథలు విజయవాడనుంచి వచ్చిననాడు వాటిని తను స్వీకరించడానికి సిద్ధం అన్నారు. అలాంటిది జరిగినప్పుడు 'దర్శక నిర్మాత'లకు వారిని పరిచయంచేసే భారం నాదని శ్రీ డి. బి. నారాయణ చెప్పారు.

విజయవాడలో చక్కటి రచయితలు వున్నారు. రచయితల్లో స్నిగ్ధత, భావనా శక్తి వుండే 'సినిమా టెక్నిక్' తెల్సుకోవడం చాలా సులభం. వీటన్నిటికి వీలుగా విజయవాడలో 'వర్క్‌షాపు' నిర్వహించడం సముచితమని తాము భావిస్తున్నట్లు శ్రీ కాట్రగడ్డ నరసయ్య చెప్పారు.

* * *

తెలుగుచిత్ర దర్శకుల్లో ప్రముఖుడయిన శ్రీ విఠలాచార్యను పెట్టుకుంటే నిర్మాతకు ప్రారంభంలోనే ఆశాజనకమయిన ఫలితం కనిపిస్తుందువల్ల ప్రతివారు ఆయన్ను డైరెక్టు చేసి పెట్టమని కోరుతున్నారు. ఆయన దర్శకత్వం [illegible] మీకు తెలియచేస్తాము:

పింజల సుబ్బారావుగారి షూటింగు, గౌతమ్ బ్రహ్మంగారి షూటింగు జరుగుతూ వుంది. రెండింటిలోనూ శ్రీ ఎన్. టి. ఆర్. కథానాయకుడు; మొదటి దాంట్లో కె. ఆర్. విజయ, రెండవ దాంట్లో జయలలిత నాయికాపాత్ర ధారిణులు.

కె. జి. ఆర్. పిక్చర్స్ యొక్క షూటింగు అక్టోబరులో ప్రారంభమవుతుంది. శ్రీ చిల్లర భావనారాయణ డైలాగులను, శ్రీ విజయా కృష్ణమూర్తి సంగీతాన్ని నిర్వహిస్తారు. ముఖ్య భూమికలను శ్రీయుతులు ఎన్. టి. రామారావు, సత్యనారాయణ ధరిస్తారు, కథానాయికగా శ్రీమతి దేవిక నటించవచ్చు.

శ్రీ రామారావు సోదరులు - సాంబశివరావుగారు స్థాపించిన రాజేంద్ర ఆర్ట్స్ వారి యొక్క షూటింగు జనవరిలో ప్రారంభం అవుతుంది. శ్రీ వీటూరి రచనను, ఘంటసాల సంగీతాన్ని సాగిస్తారు. కథానాయికా నాయకులుగా సరోజాదేవి, రామారావుగార్లు నటించేందుకు సమ్మతించారు. దుష్ట నాయకుడుగా శ్రీ సత్యనారాయణ నటిస్తారు.

డి. వి. ఎస్., శ్రీ సేవ్, శ్రీ రాజ్ ఆర్ట్స్ ఫిలింస్ అధినేతలుకూడా శ్రీ విఠలాచార్యను డైరెక్టు చెయ్యమని అడిగినట్లు తెలుస్తూంది.

* * *

యువదర్శకుల్లో గట్టివాడనిపించుకుంటున్న శ్రీ తాతినేని రామారావుకు మంచి డిమాండు యేర్పడింది. ఆయన డైరెక్టు చేస్తున్న చిత్రాలను తెలుసుకొంటే.

'భలే రంగడు' నిర్మాత శ్రీ భట్ నిర్మించనున్న రెండవ చిత్రానికి వీరే దర్శకులు. శ్రీ అక్కినేని, కుమారి వాణిశ్రీ ముఖ్యనటులు. షూటింగు జనవరినుండి హైదరాబాదు సారథిలో జరుగుతుంది.

* * *



'మా మంచి అక్కయ్య'లో శోభన్‌బాబు, కె. ఆర్. విజయ



'చిన్నారి చిదుగు'లో కాంతారావు, జ్యోతిలక్ష్మి

'నవరాత్రి' వరలక్ష్మి అభ్యుదయ చిత్రానికి దర్శకత్వం చేసిన శ్రీ తాతినేని ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్స్ వారి తదుపరి చిత్రాన్ని డైరెక్టు చేస్తారు. శ్రీ నాగేశ్వరరావు నాయకుడు. షూటింగు పారధిలో జరుగుతుంది.

* * *

'బందిపోటు దొంగలు' చిత్రాన్ని బ్రహ్మాండంగా నిర్మించిన మాధవీపిక్చర్స్ నిర్మించనున్న సెంటిమెంటల్ ఫ్యామిలీ కథకు శ్రీ రామారావు దర్శకుడు. జనవరిలో షూటింగు ప్రారంభం కాగలదని భావించబడే ఈ చిత్రంలో నాగేశ్వరరావుగారు కథానాయకుడిగా నటిస్తారు. మిగతా పాత్రలను హేమా హేమీలే ధరిస్తారని తెలుస్తోంది. మూలకథను శ్రీ గుహనాదన్ వ్రాశారు.

* * *

త్రివేణి పిక్చర్స్ అధినేత శ్రీ పి. వి. సుబ్బారావు నాగేశ్వరరావు కథానాయకుడిగా నిర్మించనున్న సాంఘికాన్ని శ్రీ టి. రామారావ్ డైరెక్టు చేస్తారు. ముఖ్య పాత్రలను [illegible]

# తెరపై "ముద్దు" కావాలా? వద్దా?

## సంస్కృతి దెబ్బతినదు...

హరనాథ్



ముద్దు ముద్దేనదే — దానిపై ప్రత్యేకమయిన అభిప్రాయం ఎవరికయినా ఏముంటుంది. సభ్యత, సంస్కారంలేని విషయాలెన్నో మనం చిత్రాల్లో చూపిస్తున్నాం. ప్రజలకు యిష్టం వున్నా లేకపోయినా చూస్తూనే వున్నారు. ముద్దులున్నా చూస్తారు. ముద్దు అనేది ఖోస్లా కమిటీ అభిప్రాయం ప్రకారం చెడ్డదేమీకాదు. దానివల్ల మన సంస్కృతి దెబ్బతినదు సంస్కృతిని నిలబెట్టుకోవడానికి, పెంపొందించడానికి ఇంకా చాలామంది చాలా విధాలయిన అభిప్రాయాలను వ్యక్తపరిచారు. ఒకవేళ మన నటీమణుల్లో కొంతమంది ఒప్పుకున్నా, నటులలో చాలామంది ముద్దు పెట్టుకోవడానికి ఒప్పుకోరు. దానికి ఎన్నో ఎన్నో కారణాలుంటాయ్ అన్నారు హరనాథ్.

## నిప్పులాంటిది...

గుమ్మడి



'కత్తి వుందనుకోండి. దాంతో యాపిల్ కోసి తినవచ్చు; అదే కత్తి గొంతుమీ కోయవచ్చు నిప్పుతో వంట చెయ్యవచ్చు; దాంతో కొంపలకు నిప్పంటించవచ్చు. అలాగే 'ముద్దు'ను కూడా. ఏదయినా వుపయోగించేవాడిపైనే ఆధారపడి వుంటుంది'

## ఎలా సాధ్యం?...



హాస్యనటుడు శ్రీ రాజబాబు యిచ్చిన సమాధానం: 'ముద్దు' వద్దనే వద్దు. మనసంస్కృతి, సాంప్రదాయం మంటకలిపి పాశ్చాత్యులు చేసే 'ముద్దు'ను అంగీకరించాలి. అదెలా సాధ్యం?

## సన్నివేశాన్నిబట్టి...

ప్రముఖ నిర్మాత శ్రీ డి. విశ్వేశ్వరరావు వెలిబుచ్చిన అభిప్రాయం:

'మనం తీస్తున్న చిత్రాల్లో మన సంస్కృతి, ఆచార వ్యవహారాలే కనిపిస్తున్నాయా? కాబట్టి 'ముద్దు'ను కూడా సందర్భ ఔచిత్యాన్ని బట్టీ, సన్నివేశ ప్రాధాన్యతను బట్టీ పెట్టడంలో తప్పు లేదేమో అన్నారు.

## ముద్దు మనకు వద్దు...

మన నటీమణులయిన శ్రీమతి సూర్యకాంతం, రమాప్రభ గార్లు 'ముద్దు' మనకు 'వద్దు' బాబోయ్! ఆ మాట మా చెవిని పడనీయొద్దు నాయనోయ్' అని తమ విముఖతను వ్యక్తపరిచారు.

## తప్పు లేదు...



హాస్యనటుడు శ్రీ కె. వి. చలం 'ముద్దు' పెట్టడంలో తప్పు లేదంటున్నారు. మన హృదయంలో దాచుకున్న ప్రేమ జ్యోతిని యెరుకపరచడానికి 'ముద్దు' చాలా అవసరం అన్నారు.

సేకరణ: శ్రీనివాస్

...లించగలరని తెలుస్తోంది. శ్రీ బాల మురుగన్ కథకు, నార్ల చిరంజీవి మాట లను వ్రాస్తున్నారు. షూటింగు హైద్రా బాదులో జరుగుతుంది.

* * *

'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రాన్ని హిందీలో శ్రీ ప్రేంజీ నిర్మిస్తున్నారు. తెలుగులో చలం ధరించిన పాత్రను హిందీలో మహమూద్, శోభన్‌బాబు పాత్రని సంజీవకుమార్, ధరిస్తున్నారు. తెలుగు చిత్రానికి శ్రీ కె. బాలచందర్ దర్శకు డయితే హిందీ చిత్రానికి శ్రీ ఆదుర్తి సుబ్బారావు నిర్దేశకుడు.

* * *

శ్రీ ప్రత్యగాత్మ 'పెళ్ళిరోజు' హిందీ చిత్రానికి దర్శకులు; శ్రీ రాధాకృష్ణ, గోన్ నిర్మించే ఈ చిత్రంలో మాలాసిన్హా ద్విపాత్రాభినయం (తెలుగులో జమున చేసారు) చేస్తుంది. శ్రీ జగన్నాథ్ వేషాన్ని హిందీలో బిశ్వజిత్ ధరిస్తారు.

* * *

నజ్రతజిల్‌పాల్ నిర్మిస్తున్న 'మెహమాన్' చిత్రానికి శ్రీ కె. పి. ఆత్మా దర్శకుడు; ఈ చిత్రంలో రేఖ, బిశ్వజిత్ ముఖ్య పాత్రధారులు. ఈ చిత్రానికి అరవై రోజుల షూటింగు షెడ్యూలు వెయ్య బడింది. నిర్మాణం బొంబాయిలో జరుగు తున్నది. హిందీ నటి కృష్ణకుమారి నిర్మించే రెండవ చిత్రానికి, మరి రెండు

# సినిమా

నిర్మాణ సంస్థలకు డైరెక్షన్ చేసేందుకు శ్రీ ప్రత్యగాత్మ అంగీకరించారు.

* * *

తెలుగులో శ్రీ పంచవం విశ్వభారతి బ్యానర్‌లో నిర్మించనున్న చిత్రాన్ని ప్రత్యగాత్మ డైరెక్టు చేస్తారు. శ్రీ నాగే శ్వరరావు నాయకుడు; ఉత్తమ చిత్ర ప్రారంభించనున్న సాంఘికానికి వీరే నిర్దే శకులు. ఇందులోకూడా శ్రీ అక్కినేని కథానాయకుడు. నాయికగా కుమారి జయ లలిత వుండగలదని తెలుస్తుంది.

* * *

'రాజయోగం' 'రాజసింహ' చిత్రాలను నిర్మించిన శ్రీ బి. వీరరాజు అక్టోబరులో మరొక జానపదాన్ని ప్రారంభిస్తున్నారు ఈ చిత్రానికికూడా శ్రీ సుబ్బారామదాసే దర్శకుడు. శ్రీ కణ్వశ్రీ రచన, శ్రీ సత్యం సంగీతాన్ని నిర్వహిస్తారు. ముఖ్యపాత్రలను శ్రీయుతులు కాంతారావు, రామకృష్ణ, రాజనాల ధరిస్తారు. నాయికగా కుమారి చంద్రకళ నటించగలరని తెలుస్తోంది.

* * *

'మానాన్న నిర్దోషి' చిత్రదర్శకుడయిన శ్రీ నందనరావును 'జగత్‌కిలాడీలు' నిర్మాత లయిన విక్రమేశ్వరరావు, రాఘవగార్లు తమ రెండవ చిత్రానికి దర్శకునిగా నిర్ణ యించారు. కృష్ణ, వాణిశ్రీ, శ్రీ ఎస్. వి. రంగారావులు ప్రధాన పాత్రలను



'మెరుపు వీరుడు'లో జయలలిత

పోషించగలరు సంగీతాన్ని శ్రీ కోదండ పాణి నిర్వహిస్తారు. డిసెంబరులో షూటింగ్ ప్రారంభమౌతుంది పై రెండు చిత్రాలకు శ్రీ కన్నప్ప ఛాయాగ్రాహకుడు.

* * *

రవీంద్రా ఆర్ట్సు నిర్మిస్తున్న 'ధర్మ దాత' షూటింగు సెప్టెంబరు 14 న సారధి స్టూడియోలో ప్రారంభమైంది. శ్రీ సంజీవి దర్శకత్వంలో తయారయ్యే యీ చిత్రంలో తండ్రి కొడుకుగా శ్రీ నాగేశ్వరరావు నటిస్తున్నారు. తండ్రి పాత్రకు శ్రీమతి జానకి నాయిక. కోడు కను ప్రేమించే యువతిగా కుమారి కాంచన నటిస్తారు. చిత్రంలోని ముఖ్య పాత్రలను శ్రీయుతులు నాగభూషణం, పద్మనాభ, రేలంగి, రమణారెడ్డి ధరి స్తారు. సంగీతాన్ని శ్రీ చలపతిరావు,

## సినిమా డైరీ

● తిరుమల పిక్చర్స్‌యొక్క షూటింగు సెప్టెంబరు 16 న ఎ. వి. ఎం. లో ప్రారంభమైంది శ్రీ వి. రామచంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, విజయనిర్మల, గుమ్మడి, ప్రభాకరరెడ్డి పాల్గొన్నారు. ఈ చిత్రానికి శ్రీ [illegible]రావు సంగీత దర్శకుడు.

● రెడ్డి అండ్ కో '[illegible]' క్లయిమాక్సు [illegible] సెప్టెంబరు 16 న జరిగింది. శ్రీ టి. ఎ. సుబ్బారావు దర్శకత్వంలో జగ్గయ్య, వాణిశ్రీ, నాగభూషణం, అల్లురామలింగయ్య, సి. హెచ్. రాజేంద్రప్రసాద్, దేవిక, [illegible], సూర్యకాంతం, పండరీబాయి నటించారు.

● పూర్ణా ఆర్ట్సు పిక్చర్స్ 'మాతృదేవత' షూటింగు (అవుట్‌డోర్) హైద్రాబాదులో జరిగింది. శ్రీమతి సావిత్రి దర్శకత్వంలో ముఖ్యతారాగణం పాల్గొన్నారు.

● శ్రీ విఠలాచార్య దర్శకత్వంలో ఎ ఎస్ ఆర్ పిక్చర్స్ 'లక్ష్మీకటాక్షం' షూటింగు సెప్టెంబరు 13 నుండి 17 వరకు వాహినీలో జరిగింది. శ్రీ ఎన్ టి. రామారావు పాల్గొన్నారు.

● తారకరామా పిక్చర్స్‌వారి 'భలేతమ్ముడు' సెప్టెంబరు 18 న విజయకంబైన్స్ ద్వారా విడుదలైంది. ఈ చిత్రంలో శ్రీ రామారావు అన్న+తమ్ముడిగా నటించారు

● చిత్రకల్పనా వారి 'బుద్ధిమంతుడు' సెప్టెంబరు 20 న లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలయింది శ్రీ నాగేశ్వరరావు అన్నదమ్ములుగా నటించారు

ఆర్టును శ్రీ జి. వి. సుబ్బారావు, స్టూడియోను శ్రీ పి.వి. శెట్టి నిర్వహించే యీ చిత్రాన్ని డిసెంబరుకు పూర్తి చెయ్యాలను కుంటున్నారు. నిర్మాత శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి ఈచిత్రం లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలౌతుంది.

* * *

'అసాధ్యుడు' చిత్రంలో అద్భుతమయిన కెమెరావర్కును చూపెట్టిన శ్రీ వి. ఎస్. ఆర్. స్వామి నేటి బిజీ డైరెక్టరు ఆఫ్ ఫొటోగ్రఫ్ అయ్యారు. క్వాలిటీ+స్పీడు వుండడంవల్ల చాలామంది స్వామిని అడుగుతున్నారు ఆయన సాధ్యమయినంతవరకు ఒప్పుకోవడంవల్ల రాత్రింబవళ్లు పని చెయ్యడం జరుగుతూంది. తత్కారణంగా స్వామి చాలా బలహీనంగా కన్పడుతున్నారు ఇటీవల ఆయనకు రెండు రోజులు గ్యాప్ దొరికింది హాయిగా యింటిదగ్గర రెస్టు తీసుకుని వుండొచ్చు. ఆయన యేం చేసాడో తెలుసా? సరాసరి చిన్ని బ్రదర్స్ ఆఫీసుకు వెళ్లి 'నాకు ఖాళీ దొరికింది. మీరు షూటింగు పెట్టుకోండి' అని అడిగారు వృత్తిపై ఆయనకు గల శ్రద్ధాసక్తులే నేటి అభ్యున్నతికి కారణమయ్యాయి. ప్రస్తుతం పది చిత్రాల ఛాయాగ్రాహకుడు శ్రీస్వామి.

* * *

కుమారి శాంతి ప్రముఖనటి అవుతుందని పరిశ్రమలో పలువురు సాహించారు. వారి వూహమేరకు ఆమె బాగానే నటించింది. కానీ అదృష్టం ఆమెను మరో ప్రక్కకు లాక్కెళ్ళింది. నిర్మాత అయింది. తెలుగు, తమిళ డబ్బింగు చిత్రాలను నిర్మించి మంచిలాభాలను గడించింది. ఇపుడు 'కన్నెపాప' అనెడి ఫ్యామిలీ సెంటిమెంట్సుగల సాంఘిక చిత్రాన్ని నిర్మించడానికి పూనుకుంది. శ్రీ ఆరుద్ర రచన సాగించారు శ్రీ వి రామచంద్ర దర్శకునిగా నియమించింది. ఆమె ప్రముఖ నిర్మాతగా చక్కటి చిత్రాలను నిర్మించగలదని ఆశించవచ్చు. ఈ చిత్రంలో హరనాథ్, బేబి రాణి ప్రధాన పాత్రధారులు. మిగతా పాత్రలను శ్రీయుతులు రేలంగి, రమణారెడ్డి, ఛాయాదేవి గెస్టుగా నటించడానికి అంగీకరించారు. కృష్ణంరాజు ఒక ముఖ్యభూమికను ధరిస్తారు. ఈ చిత్రానికి సుదర్శనం (ఎవిఎం ఫేం) సంగీతాన్ని, రాజేంద్రకుమార్ ఆర్టును నిర్వహిస్తారు. అక్టోబరులో శారదా స్టుడియోలో ప్రారంభించబడే యీ చిత్రానికి శ్రీ ఫిలింస్ పంపిణీదారులు. కెమెరాను శ్రీ వి. ఎస్. ఆర్. స్వామి నిర్వహిస్తారు.

# సినిమా

సాహసానికి మరోపేరు శ్రీ డి. ఎల్. నారాయణ; ఆయన ధైర్యంగా నిలబడి 'దేవదాసు' 'కన్యాశుల్కం' 'ఏకవీర' లను నిర్మించారు ఆయన సైంటిఫిక్–కమ్–క్రయిం బ్యాక్‌గ్రౌండుగల ఎక్స్పెరిమెంటల్ (దొరికితే దొంగలు) చిత్రాన్ని నిర్మించారు. ఆ చిత్రానికి సుబ్రహ్మణ్యంను దర్శకునిగా నియమించడం మరో సాహసం. ఆ సుబ్రహ్మణ్యమే చాలాకాలం తర్వాత 'పాండవుల బాల్యకథ'కు దర్శకుడయ్యారు. ఈ చిత్రంలో సుబ్రహ్మణ్యం దర్శకత్వపు మెళకువలు ప్రతి అడుగునా ద్యోతకమయినట్లు తెలుస్తూంది. శ్రీ కె. హనుమంతరావు నిర్మిస్తున్న ఈ చిత్రం అతి త్వరలో పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలౌతుంది. జూనియర్ సముద్రాల రచనలో నెలవడ్డ పాత్రలను శ్రీయుతులు కాంతారావు, నాగయ్య, అంజలీదేవి, కాంచన, జి. వరలక్ష్మి, ధూళిపాళ, ముక్కామల పోషిస్తున్నారు.

* * *

మేకప్‌శాఖలో రెండున్నర దశాబ్దాల అనుభవంవున్న శ్రీ వి. భద్రయ్య నిర్మాత అయ్యాడు. 'భద్రయ్యా, నేను వున్నాను. నిర్భయంగా పిక్చర్ తీయవయ్యా. పెద్ద తారలను పెట్టి చక్కగా నిర్మించవయ్యా'

## మీకు తెలుసా?

హాలివుడ్ నటి శ్రీమతి ఎలిజబెత్ టైలర్ ఒక చిత్రంలో నటించడానికి పది లక్షల డాలర్లు తీసుకుంటుందట

'చుట్టరికాలు', 'బాంధవ్యాలు' చిత్రాలలో నటించిన కుమారి లక్ష్మి ప్రస్తుతం 30 చిత్రాలలో ప్రముఖ పాత్రలను ధరిస్తూంది. ఆమె శ్రీమతి రుక్మిణి కుమార్తె.

నటి శ్రీమతి దేవిక తమిళంలో 'సీత' నాటకంలో నాయికగా నటిస్తూంది.

హిందీ నటుడు శ్రీ మహమూద్ తమిళ చిత్రాలను కొని హిందీలో నిర్మించి ఘన విజయాన్ని, ధన విజయాన్ని సాధిస్తున్నారు

శ్రీమతి సయిరాబాను చిన్నతనంలో శ్రీ దిలీప్‌కుమార్ నటించిన చిత్రాలను ఒకటికి పదిసార్లు చూసేదట.



'మనుషులు మారాలి'లో శోభన్‌బాబు, శారద

అని విశ్వశాంతి విశ్వేశ్వరరావుగారు అభయహస్తం యిచ్చారట. అలాగే శ్రీ ఎన్. టి. రామారావుకూడా తన సంపూర్ణ సహకారాన్ని అందిస్తున్నారట. భద్రయ్య + వరప్రసాదరావులు 'మమతచిత్ర'ను స్థాపించారు. శ్రీ సి. ఎస్. రావు దర్శకత్వాన్ని చేపట్టడానికి సమ్మతించారు. మహారథి రచన చేస్తున్న ఈ సాంఘిక చిత్రంలో శ్రీ ఎన్. టి. ఆర్. ద్విపాత్రాభినయం చేస్తారు. నాయికగా దేవిక నటిస్తారు. షూటింగు అక్టోబరులో ప్రారంభం కాగలదని తెలుస్తోంది. 'శ్రీ రామారావు, శ్రీ విశ్వేశ్వరరావుగార్లు నాకు చేస్తున్న సహాయానికి నేను ఆజన్మాంతం ఋణపడి వుండాల్సిందే. నేను పరిశ్రమలో పెద్దల అభిమానాన్ని యింతగా చూరగొనడం నా అదృష్టం' అన్నారు భద్రయ్య.

* * *

'ఆడపడుచు' నిర్మాత, దర్శకుడయిన శ్రీ కె. హేమాంబరధరరావు మద్రాసు హాలీవుడ్ అనిపించుకునే వడపళనిలో ఒక ప్రివ్యూ థియేటరును నిర్మిస్తున్నారు. ప్రసాద్ స్టుడియోకు సమీపాన నిర్మించబడుతున్న ఈ థియేటరు జనవరిలో ప్రారంభించబడుతుంది. మద్రాసులో ప్రివ్యూలకు థియేటర్ల అవసరాన్ని గుర్తించిన శ్రీ హేమాంబరధరరావు [illegible] స్ఫూర్తిని అభినందించాలి. ఈ థియేటరుకు 'సుభాషిణి ప్రివ్యూ థియేటరు' అని పేరు. వీరి 'ఆడపడుచు' ఆంధ్రాలో పలుకేంద్రాలలో యీవారం విడుదలయింది.



'అగ్గిపిడుగు'లో ఎన్. టి. రామారావు, రాజశ్రీ

* * *

'ధర్మపత్ని' నిర్మాత శ్రీ జయరామ రెడ్డి సాలుకు మూడు చిత్రాలను నిర్మించడానికి సంకల్పించారు. పట్టుదలతో ఏదైనా సాధించగల స్వభావంగల శ్రీ రెడ్డి నవంబరులో మరొక సాంఘికాన్ని నిర్మిస్తారని 'కర్తవ్యం' దర్శకుడు శ్రీ ప్రభాకర రావు వెల్లడించారు.

* * *

శ్రీ తోట రామ్మోహనరావు ఉష శ్రీ చిత్రనిర్మాణ సంస్థయొక్క తొలిచిత్రానికి దర్శకుడు. హరనాథ్ నాయకుడు. అక్టోబరులో షూటింగు జరుగుతుంది. చంద్రా మూవీస్ 'వైకుంఠపాళి' చిత్రం కూడా త్వరలోనే విడుదలకాగలదని తెలుస్తోంది. ఈచిత్రంలో కృష్ణకుమారి, హరనాథ్ నాయకీ నాయకులు.

—శ్రీనివాస్

# అతడి కథ...

(15-వ పేజీ తరువాయి)

వంతం చెయ్యబోయాట్ట. నేను చూచి వస్తాను మీరిక్కడే ఉండండి' అంటూ అతడు బయలుదేరాడు.

'ఉండవయ్యా, నేనూ వస్తాను'అంటూ అతడి వెంబడే ఆయనా బయలుదేరారు. అప్పట్నుండి లోకమే అట్లా ఉంది— ఎవరయినా బయలు దెరుతారు మోహనరావు గారు బయలుదేరారు ఆ పంచాయతీ పెద్దల్లో కలిసిపోయారు. ప్రక్కనేవున్న వీధి దీపం క్రింద పంచాయతీ ప్రారంభం అయింది అక్కడున్న జనంలో మేస్త్రీలు, అతడే కాస్త పెద్దతరహా మనుష్యులుగా కన్పడుతున్నారు. మిగిలిన వాళ్ళనుబట్టి అక్కడ పెద్దమనిషి ఒక డ్రైవరులా ఉన్నాడు. అతడని నిలదీసి అడుగుతున్నాడు...

'ఎవడవురా నువ్వ'

'రిష్కావోణ్ణండి' అన్నాడు మత్తులోనే

'నీ పేరేటి'

'ఈరిగాడ్నండి'

'ఏవూరు'

'అల్లిపురం'

'ఏదీ ... మొగం సూస్తియ్యండె నే... అంటూ ఓ రిక్షా డ్రైవరు జుట్టుపట్టుకొని పైకెత్తాడు.

'ఓరి దొంగసచ్చినోడా...ఓర్ రండ్రోయ్. ఈ యెదవ మన స్టేండోడు కాదురా. ఎక్కడ్నుండో వచ్చి మన స్టేండోణ్ణంటుండాడ. ఇంతలో మరో రిక్షావాడు 'నాలుగు తగల్నియ్యండే. మత్తొదిల్తే అడే సరింగా కూత్తాడు. అడ్డమైనెదవలు ఈడకొచ్చి మన డ్రైవర్ల పేరెట్టుకొంటారు.'

'ఇట్టాగైతే మన బతికేవరు ఎక్కడ్రా' మరో రిక్షావోడు

'వేసిపోని గొడవ తెచ్చినాడు. ఈ దొంగనాయాలి'

'ఒరే నిబద్దంగా సత్తెం సెప్పరా నిన్నొగ్గేత్తాం ... మా పరువు తీయకురా నాయనా' తన ఒంటికాలితో కుంటేవాడు క్రర ఊతబుచ్చుకొని వచ్చాడు. అడూ రిక్షావాడిలాగే ఉన్నాడు ఆ రిక్షావాళ్ళ తమ నీతి నిజాయితీకోసం వాడిదగ్గరనుండి నిజం చెప్పించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇంతలో 'ఏహే ... వన్నొగ్గండ్రా.. మికె గుడదా తెల్దు ... అది మొగుణ్ణి సూద మండిరా ... ఎందిలికాడ నాకు సెప్పింది. కావలిత్తే దాన్నె అడగండి...' అన్నాడు మన ఈరిగాడు. అందరూ ఒక్కసారిగా ఒకరి మొగాలు ఒకరు చూసుకున్నారు. 'అక్కలు దని పిలండ్రా' అన్నాడు పెద్ద డ్రైవరు కొత్త ఉత్సాహంతో—వో వలుగురు గబగబావెళ్ళి ఆమెను పిలుచుకొచ్చారు. అందరి దృష్టి ఈరిగాడిమీద నుండి ఆ యాడమనిషిమీద పడింది ఏమిటి విశేషం అన్నట్లుగా. ఆమె తత్తర పాటులో ఓలమ్మో... ఈడిసేత్తు లిరగ ... ఆడి జిమ్మడ... మాయిదారోడు అబద్దం సెబుతుండాడు ఆ యెదవ యెవడో నాకు తెల్దు...' అంటూ అదోదబోమని సాగం పెడుతు మళ్ళీ తన నులక మంచం చేరిపోయింది. 'గట్టిగా నాలుగివ్వండెయ్ ... మత్తుదిత్తు ఒగ్గితే సత్తెం కూత్తాడు. అద్దరేతిరికాడ మా మంచి గొడవ తెచ్చిపెట్టిండు...'

'ఒరే ఈరిగా... మరి గంటే విన్నెం అనం...కొంచెం సేదవడి సెప్పరా ... అసలు అది ఎవత్తెరా దాందేవూరు ఎందుకు ఈడకొచ్చింది అన్నీ కరకట్టుగా సెప్పితే ఉన్న పాలాన నిన్నొగ్గేత్తాం...'

'ఒరే సెపతాను యినండ్రా. ఈ దిక్కుమాలిన లోకం నిజాన్ని ఎప్పుడు నమ్మింది గనుక... మరే... సాయంత్రం నేను రిష్కా బేరంతో వచ్చినాను. బేరం దించేసి యింకో బేరం కోసరం స్టేండుకాడ కాసంతసేపు నిలుసున్నాను. అప్పుడు యీ యెదవ వంజొచ్చి అడగా సెప్పకుండా నా బండెక్కేసి ఓసిను కాడ కెళ్ళనీ అంది... అట్టాగే అన్నా... సావులు మదుంకాడి కెళ్ళేసరికి రిష్కా నిలబెట్టమంది. నిలుసుండబెట్టా. ఏందమ్మా ఓసిని యిక్కడ గాదు...మల్లా మా పెద్ద ఓసిని వచ్చేసింది గదా అది లెక్కడా...

'అంతదాకా అక్కర్లెద్దుకానీ... యింద ఈ రెండు రూపాయిలు నువ్వు తీసుకో'

'రెండు రూపాయిలెందుకూ... మస్పాత లిస్తే పాలు'

'పరవానేదునే...ఉంచుకో'...'అబ్బో నీతి ఈ యీరావేనా?...'

STUDIO Keth

చూచి ఆనందించండి!



తారకరామ పిక్చర్స్ వారి

# భలే తమ్ముడు

దర్శకత్వం: బి.ఎ. సుబ్బారావు
నిర్మాత: ఎ. పుండరీకాక్షయ్య

డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర: విజయ
సీడెడ్: నవభారత్ నైజాం: దివ్యదత్తా

VIJAYA

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

